**1976 సం. ఉత్తమ చలనచిత్ర బహుమతుల ప్రదానోత్సవం**



















# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 22 | డిశంబరు, 1977 | సంచిక : 2

కార్తీక—మార్గశిర, 1899 శా. శ.



ప్రధాన సంపాదకులు :

శ్రీ రాజ్యంసిన్హా

సంపాదకులు :

కుందుర్తి ఆంజనేయులు


ముఖచిత్రం : ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాలు.

రెండు, మూడు కవరు పేజీలు : చలనచిత్ర బహుమతుల ప్రదానోత్సవ దృశ్యాలు

చివరికవరు పేజీ : గాజులదిన్నె ప్రాజెక్టు దృశ్యం (కర్నూలు జిల్లా)


**వెల: 50 పైసలు**

సాలుచందా : ఆరు రూపాయలు

రిజిస్టరు నెం : హెచ్. హెచ్. డి. 81

ప్రచురణ:
డైరెక్టరు,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
సమాచార, పౌర సంబంధశాఖ
గృహకల్ప, హైదరాబాదు.

ముద్రణ:
డైరెక్టరు,
ఆంధ్రప్రదేశ్
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం
చంచల్‌గూడా, హైదరాబాదు.


కోస్తాజిల్లాల్లో కనీవినీ ఎరుగని తుఫాను, ఉప్పెనబీభత్సంలో విషాద స్థితినొందిన తెలుగు కుటుంబాలకు మాహృదయ పూర్వక సానుభూతి. —ఎడిటర్



## ఈ సంచికలో..

పేజీ


2 ఆపదలోవున్న వారిని ఆదుకుందాం

4 కళ్యాణి డాం : శ్రీ ఎం. పరబ్రహ్మం

6 ఆం.ప్ర. ఫిషరీస్ కార్పొరేషన్ : శ్రీ వి. మహేశ్వరరావు

9 శ్రీకాకుళమ్మ నిర్జిత నాకలోకమ్ము: శ్రీ ఆదిభట్ల వెంకట రమణ

11 బాలల అకాడమీ : శ్రీమతి జె. ఎస్. లక్ష్మి

15 పోలవరం ప్రాజెక్టు : శ్రీ బి. యల్. సత్యనారాయణ

16 పోలియో నివారణ : శ్రీమతి అన్నపూర్ణ

18 వంతెన నిర్మాణానికి వజ్ర సంకల్పం: శ్రీ ఎం.ఎస్. ఇస్మాయిల్

20 ఆంధ్రసాహిత్యము: వేషధారణ: డా. నండూరి వేంకట సత్యనారాయణ

24 హరిజనవాడ (సీరియల్) : శ్రీ ఉన్నవ మదన మోహన రావు

28 శ్రీకాకుళం జిల్లాలో గిరిజనాభివృద్ధి: శ్రీయుతులు ఎం. బాపూజీ, జె.వి.కె.వి. పండిట్

31 త్రిభుజం (కథానిక) : శ్రీ దోనేపూడి రాజారావు

37 నడుపూడి, ఎలమంచిలి : శ్రీ సిద్దాని నాగభూషణం

41 మహాభారతము (సీరియల్) : శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి

43 రాజధాని విశేషాలు : ఎల్లోరా


ముఖ్యమంత్రి సహాయనిధికి
ఉదారంగా విరాళా లివ్వండి



# ఆపదలో ఉన్నవారిని ఆదుకుందాం



## కాళరాత్రి

1977 నవంబరు 19 ఆంధ్ర ప్రదేశ్ చరిత్రలో ఒక కాళ రాత్రి. ఆ శనివారం కోస్తా జిల్లాలలో సంభవించిన పెనుతుఫాను అనేక పల్లెలనూ, పట్టణాలనూ అల్లకల్లోలం చేసింది. కటిక చీకట్లు అలుముకున్న వేళ, ఎలుగెత్తి ఆర్తనాదాలు చేసినా ఎవరికీ అందని వేళ సంభవించిన మహా జలప్రళయంలో ఆకాశమంత ఎత్తున లేచిన ఉప్పెనలో వేలాదిమంది హతులై పోయారు.

ప్రకృతి జరిపిన పైశాచిక విలయకేళికి సంబంధించిన వాస్తవ స్వరూపం ఇప్పుడిప్పుడే స్పష్టమవుతున్నది. ఈ తుఫాను ప్రకాశం, గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో మున్నెన్నడూ ఎరుగనంతటి బీభత్సాన్ని సృష్టించింది. అపారంగా ఆస్తులు, పంటల నష్టంతోపాటు ఈ మహా భయంకర విపత్తులో ఎన్నో కుటుంబాలు నశించిపోయాయి. ఈ ఉప్పెన, పెనుతుఫానుల ప్రభావం విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలను కూడా తాకి అక్కడ భారీవర్షాలు, వరదలకు కారణమయింది. పంటలు బాగా పాడయి పోయాయి.

కడలితరంగాల ప్రచండ ఘోషలకు కృష్ణా జిల్లా దివి సీమ లోని ఎన్నో గ్రామాలు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకు పోయాయి. కోస్తా జిల్లాలలో రైతులు దారుణంగా దెబ్బతిన్నారు. పుష్కలంగా పండి నోటి దగ్గరకు వచ్చిన పంట దక్కకుండా పోయింది. తుఫాను వీచిన అన్నిచోట్లా వరి దెబ్బ తిన్నది. చెరకు విరిగిపోయింది. అరటి తోటలు ధ్వంసమయ్యాయి. కోళ్ళ ఫారాలు, బ్యారన్లు, ఖండసారి ఫ్యాక్టరీలు, లక్షలాది యిళ్లు నాశన మయ్యాయి. బీదాబిక్కీ ఉన్నదంతా కోల్పోయారు. లక్షల సంఖ్యలో పశువులు కొట్టుకుపోయాయి.

దివి సీమ, రేపల్లె, బాపట్ల, గుంటూరు ప్రాంతాలలో ప్రాణ నష్టం విపరీతంగా జరిగింది పచ్చని పంట పొలాలతో కళకళలాడే పల్లెటూళ్లు శవాల గుట్టలతో, జంతు కళేబరాలతో నిండి హృదయ విదారకంగా తయారయ్యాయి. అనేక చోట్ల విద్యుత్ స్థంభాలు మెలికలు తిరిగి రోడ్డుకడ్డంగా పడిపోవడంతో రాకపోకలకు అవ రోధం ఏర్పడింది

## జాతీయ విపత్తుగా పరిణమించిన జల ప్రళయం

కోస్తా జిల్లాలకు సంభవించిన విపత్తు కేవలం ఆంధ్ర ప్రదేశ్ కు సంబంధించింది కాదు. ఇది జాతి విపత్తు. ఎన్నో పల్లెలూ, పట్ట ణాలు, పడిపోయిన చెట్లు, గోడలు, టెలిఫోను, విద్యుత్ స్థంభాలు, తీగలతో శిధిలాలయాలుగా మారాయి.

ఇంతవరకూ అందిన వివరాలను బట్టి తుఫాను బీభత్సంలో 8,333 మంది మరణించారు మరో 3,000 మంది దాకా కన బడడం లేదు. లక్షన్నర పశువులు చనిపోయాయి. మరో లక్షన్నర

ఇతర జంతువులు మృతి చెందాయి 8 లక్షల 35 వేల గృహాలు నేలమట్టం కాగా 30 లక్షల 40 వేల మంది నిరాశ్రయు లయ్యారు. తుఫాను ప్రాంతాలలోని 2,302 గ్రామాలలో 71 లక్షల మంది ఏదో ఒక విధంగా దెబ్బ తిన్నారు.

పెనుతుఫాను, ఉప్పెనలవల్ల అయిదు జిల్లాలలో 39 లక్షల 97 వేల ఎకరాలలో వరి, పొగాకు, మిర్చి, అరటి, చెరకు పంటలు నాశనమయ్యాయి. రోడ్లు, విద్యుత్, టెలి కమ్యూనికేషన్ పరి కరాలు, రైల్వే ఆస్తులు, నీటిపారుదల కాలువలు మొదలైన ప్రజోపయోగకర సాధనాలకు బాగా నష్టం వాటిల్లింది.

## సత్వర సహాయ చర్యలు

సత్వరం ప్రభుత్వం కదిలింది. వనరులన్నిటినీ సమీకరించి తుఫాను బాధితులకు సమర ప్రాతిపదికపై సహాయం అందజేస్తున్నది. సర్వస్వం కోల్పోయిన సముద్రతీర గ్రామ ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించారు. డబ్బు ఎంత ఖర్చయినప్పటికీ వెనుకాడ కుండా సహాయ కార్యక్రమాలు చేపట్టవలసిందని, పూర్తి అధికారా లతో కమిషనర్లను తుఫాను బాధిత జిల్లాలకు నియమించారు.

విషాద దృశ్యాలమధ్య ఆర్తులకు ముమ్మరంగా సహాయ కార్యక్రమాలు అమలుచేస్తున్నారు. అన్నం పొట్లాల సరఫరా, కలరా లాంటి అంటువ్యాధులు ప్రబలకుండా ఆరోగ్య కార్యక్రమాలు, కూడూ నీడ కోల్పోయిన బాధితులకు తక్షణ సహాయం కర్తవ్యా లుగా ప్రభుత్వం కృషి చేస్తున్నది. తుఫాను వల్ల వచ్చిన వరదలలో చిక్కుకున్న గ్రామీణ ప్రజలకు హెలికాప్టర్ల ద్వారా ఆహార పదార్థాలు సరఫరా చేస్తున్నారు.

ఉప్పెనకు గురి అయిన గ్రామాలలో చెరువులు, నూతులు ఉప్పునీటితో నిండిపోయాయి. చనిపోయిన వారు చనిపోగా, బతికి వున్నవారికి మంచి నీటి సరఫరా ఒక సమస్య అయింది. అంతే కాకుండ మానవ, జంతు మృత కళేబరాల తొలగింపు గడు పరిస్థితి కలగ జేసింది. ట్యాంకర్ల ద్వారా మంచి నీరు సరఫరా చేస్తున్నారు. శవాలను తొలగించే కార్యక్రమం రమారమి పూర్తయింది.

తుఫాను బాధిత ప్రాంతాలలో సాగుతున్న తక్షణ సహాయ, పునరావాస కార్యక్రమాలను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు పర్యవేక్షిస్తున్నారు. అన్ని గ్రామాలలోనూ వైద్య, ఆరోగ్య సదుపాయాలు సమకూరుస్తున్నారు. పాడి పశువులకు అంటు రోగాలు సోకకుండా భారీ ఎత్తున చర్యలు తీసుకొన్నారు. మృతుల కుటుంబాలకు ఒక్కొక్కరికి వెయ్యి రూపాయలు వంతున, గృహాలు కోల్పోయినవారికి ఒక్కొక్కరికి 150 రూపాయల వంతున ఆర్థిక సహాయం అందజేస్తున్నారు.

ఈ ప్రాంతంలో రెండు రోజులపాటు పర్యటించి, బీభత్సానంతర దృశ్యాలను తిలకించిన రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్ర ప్రభుత్వం శీఘ్రగతిని సహాయ కార్య క్రమాలు చేపట్టడం పట్ల సంతృప్తి వెల్లడించారు. భారత ప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్, రక్షణ మంత్రి శ్రీ జగ్జీవన్‌రామ్ ప్రభృతులు తుఫాను బాధిత ప్రాంతాలను సందర్శించి, కేంద్ర ప్రభుత్వం ఈ ఆపదలో అన్నివిధాలా ఆదుకుంటుందని ప్రకటించారు.

విపత్తుకు గురిఅయినవారికి పునరావాసం కల్పించడానికి రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు శాయశక్తులా కృషిచేస్తున్నాయి. ఈ బృహత్ సమస్యను ఎదుర్కోడానికి ప్రభుత్వ యంత్రాంగం, సాధన సంపత్తి మాత్రమే సరిపోవు. స్వచ్ఛంద సేవాసంస్థలు, మానవతాసంఘాలు, దాతల చేయూత ఎంతైనా అవసరం.

ప్రళయ భయంకరంగా వీచిన మహా ప్రభంజనంలో సర్వస్వం కోల్పోయిన అసంఖ్యాక ప్రజల ఆర్తనాదాలు తెలుగుతల్లి హృదయాన్ని కలచివేస్తున్నాయి. ఆపదలో ఆక్రోశిస్తున్నసు సోదరులను ఆదుకోవడం అందరి పవిత్ర కర్తవ్యం.

ముఖ్యమంత్రి సహాయనిధికి విరివిగా విరాళాలు యివ్వండి.

విరాళాలన్నింటినీ ప్రభుత్వ కార్యదర్శి, రెవెన్యూ శాఖ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదుకు పంపాలి. చెక్కులను ముఖ్యమంత్రి పేర ముఖ్యమంత్రి సహాయనిధికి పంపాలి. ఔషధాలు, దుస్తులు, ఇతర వస్తువులను ప్రభుత్వ రెవెన్యూ శాఖ కార్యదర్శికి గాని, నేరుగా జిల్లా కలెక్టరుకుగాని అందజేయవచ్చు.





### తిరుపతి పాలిటి వరప్రసాదం

# కళ్యాణిడామ్

—శ్రీ ఎం. పరబ్రహ్మం

కళ్యాణిడామ్ పథకము చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకా యందు తిరుపతి మదనపల్లె రోడ్డులో తిరుపతికి 20 కిలోమీటర్ల దూరమున కళ్యాణి నదిపై నిర్మించబడినది. నీటి పరిశుద్ధికై ఫిల్టరు హౌస్ నిర్మాణముకూడా డాముదగ్గరగా జరిగినది. తిరుపతిపట్టణములో 70 వేల మంది జనాభా కాక సగటున రోజుకు 40 వేల మంది యాత్రికులు వచ్చు సందర్భమును పురస్కరించుకుని, 45లక్షల గాలనుల నీరు అదనముగా లభించుటకు తిరుపతి పురపాలక సంఘము తిరుమల–తిరుపతి దేవస్థానము వారు యీ పథకమును చేపట్టిరి. ఈ డాము మొత్తం ఖర్చు 540 లక్షల రూపాయలు. ఈ ఖర్చును మూడింట రెండు వంతులు పురపాలక సంఘము వారు మిగిలిన ఒక వంతు దేవ స్థానము వారు భరించుటకు అంగీకారము కుదిరినది.

ఈ డాము నిర్మాణము 1973వ సంవత్సరము ప్రారంభించబడి 1978వ సంవత్సరము జనవరి నాటికి పూర్తి కాగలదు. సంవత్సమునకు తిరుపతి పట్టణ అవసరాలకు 2628 లక్షల ఘనపుటడుగులు నీరు కావలసివుండగా యీ జలాశయంలో ఉపయోగపడు నీటి పరిమాణము 8760 లక్షల ఘనపుటడుగులు కాబట్టి–2 సంవత్సరములవరకు వర్షములు కురువకున్నను తిరుపతి పట్టణ నీటి అవసరాలను తీర్చగల కల్పతరువు యీ కళ్యాణిడామ్ పథకం.

ఇది 1800 అడుగులు పొడవు, 120 అడుగులు ఎత్తును కలిగిన రాతి కట్టడపు డాము. దీని స్పిల్‌వేకు 40 అడుగుల పొడవు 25 అడుగుల ఎత్తు కలిగిన మూడు రేడియల్ గేటులు అమర్చబడును, స్పిల్‌వే పైని 9 అడుగుల వెడల్పుగల ఒక వంతెన నిర్మింపబడగలదు.

15 అడుగుల వ్యాసము కలిగిన ఇన్‌టేక్ టవరు నుండి 18 అంగుళముల వ్యాసము కలిగిన 4600 అడుగుల పొడవు కాంక్రీటు గొట్టముల ద్వారా ఫిల్టరు హౌస్ వరకు తీసికొనిపోబడి అక్కడ ఫిల్టరులయందు నీరు శుభ్రపరుపబడును. అక్కడ నుండి తిరుపతి గల రిజర్వాయరులోనికి గ్రావిటీ ద్వారా పంపబడును ఈ రిజర్వాయరు నుండి డిస్ట్రిబ్యూషన్ సిస్టమ్ ద్వారా తిరుపతి పట్టణమునకు

నీటి సరఫరా చేయబడును. ప్రాజెక్టు పూర్తిచేయుటకు అనగా గేట్లు అమర్చుటకు, బ్రిడ్జికిని 45 లక్షల రూపాయలు కావలసియున్నది.

## లభించే నీరు :

| | | |
|---|---|---|
| సాలుసరి అత్యధిక నీటి లబ్ధి... | 238`0 లక్షల ఘ. అ. | |
| సాలుసరి అత్యల్ప నీటి లబ్ధి... | 2060 | ,, |
| సాలుసరి సగటు నీటి లబ్ధి ... | 7960 | ,, |

## జలాశయము :

| | | |
|---|---|---|
| నీటి సరఫరా చేయగల అత్యల్ప మట్టము | 834. 00 | ,, |
| నీటి సరఫరా చేయు గొట్టపు మట్టము | 826. 00 | ,, |
| ఎట్టి పరిస్థితులలోను తగ్గని నీటి మట్టము | 854 00ల. ఘ.అ. | |
| పూర్తి జలాశయము నీటి మట్టము | 900. 00 | ,, |
| డాము పై మట్టము | 907 00 | ,, |
| పూర్తి జలాశయపు నీటి పరిమాణము | 9100 | ,, |
| నికరమైన నీటి పరిమాణము | 8760 | ,, |

22-9-1977 తేదీన మన ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రి గారైన శ్రీ జలగం వెంగళరావుగారి అమృత హస్తాలతో యీ కళ్యాణి డామ్ మంచినీటి సరఫరా ప్రారంభోత్సవము జరుగుట తిరుపతి పారిశ్రామికాభివృద్ధికి నాంది అని చెప్పవచ్చును. తిరుపతి రేణిగుంట ప్రాంతములో త్వరలో రానున్న పెక్కు పరిశ్రమలకు యీ పథకము వలన నీరు పుష్కలముగా లభించగలదు.



---

## దివ్వెను వెలిగించాలి

ఆపదలో ఉన్నవారి నాదుకోండి మీరు
నిరాశ్రయుల కాపాడీ నిలుపు కోండి పేరు

తెలుగు జాతి కష్టాలను తొలగించాలి
ప్రళయ బాధితులకు నీడ కలిగించాలి
ఉన్నదానిలో కొంత ఉదారముగ ఇవ్వాలి
అన్నీపోయిన వారికి అన్నమైన పెట్టాలి.

తుఫానులో మాయమైన ఊళ్ళను నిర్మించాలి
ఇళ్లలో మళ్లీ ఒక దివ్వెను వెలిగించాలి
తెలుగుజాతి ఏకముగా దీనుల కాపాడాలి
ప్రళయాన్నే యెదిరించీ ప్రజలు బ్రతుకగలగాలి

—డా. దాశరథి

# ఆంధ్రప్రదేశ్ ఫిషరీస్ కార్పొరేషన్

—శ్రీ వి. మల్లేశ్వరరావు

ఆంధ్ర ప్రదేశ్ అన్నింట ముందంజ వేస్తోంది. దేశప్రగతికి తన అడుగుకూడా కలుపుతోంది. కేంద్రంయొక్క ఆశయాలను అమలుపరచటానికి శక్తికొలదీ ప్రయత్నిస్తోంది. అభ్యుదయపథంలో ఆయాసంలేని పరుగులు తీస్తోంది. మన రాష్ట్ర ప్రభుత్వం బలహీన వర్గాల సముద్ధరణకి స్థాపించిన గిరిజనాభివృద్ధి కార్పొరేషన్ వంటి బృహత్తర సంస్థలను దీనికి తార్కాణంగా పేర్కొన వచ్చును. ఆంధ్రప్రదేశ్ ఫిషరీస్ కార్పొరేషన్ యొక్క ప్రాముఖ్యత, నిర్మాణం, కర్తవ్యాలను, చేపట్టిన కార్యక్రమాలను గూర్చి క్లుప్తంగా వివరించటయే ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం.

## తరగని తీర సంపద

సెలయేళ్ళ పడుగు పేకలతో కనులపండుగ కలిగించే మన రాష్ట్రం, మత్స్య పరిశ్రమకు ఆలవాలమై వేలకొలది మత్స్య పారిశ్రామికులకు జీవనోపాధి కలిగించుచున్నదని చెప్పటలో సందేహం లేదు. ఈ రాష్ట్రం సుమారు 1000 కిలోమీటర్ల తీర ప్రాంతం కలిగివున్నది —శ్రీకాకుళం 92, విశాఖపట్నం 160, తూర్పుగోదావరి 174, పశ్చిమ గోదావరి 32, కృష్ణా 80, గుంటూరు 42, ప్రకాశం 102, నెల్లూరు 200— 12వేల చదరపు మైళ్ళ వైశాల్యంతో చేపల వేటకు బాగా అనుకూలంగా వుంది. 8 లక్షల ఎకరాల మంచినీటి వనరులు వున్నాయి. 2 లక్షల 8 వేలమైళ్ల పొడువుగల నదీ తీరాలు, వాగులు వున్నవి. 2 చదరపుమైళ్ల నుండి 40 చదరపు మైళ్ళవరకు విస్తీర్ణం గల 50 పెద్ద జలాశయాలు, సుమారు 6,67,762 ఎకరాల వైశాల్యం గల 40 వేలు చెరువులు, 2వేల చదరపు మైళ్ళ విస్తీర్ణంగల నీటి కయ్యలు వున్నవి. గోదావరి, కృష్ణా, పెన్నా నదులు, వీటిశాఖలు, ఉపనదులలో అపారమైన జలసంపదవుంది.

ఫిషరీస్ కార్పొరేషన్ స్థాపించక పూర్వం మత్స్యకారుల స్థితిగతులు:— ఫిషరీస్ కార్పొరేషన్ స్థాపించకపూర్వం మన రాష్ట్రంలోని మత్స్యకారులు స్వార్థపరులైన షావుకార్లు, దళారీలదారుణ దోపిడీకి బలయ్యారు. వీరు నాగరిక ప్రపంచమునకు దూరంగా ఉండుటచేత అజ్ఞానం, మూఢాచార సాంప్రదాయాల సాలిగూటిలో చిక్కుకొని పోవుటచేతను అంతులేని పేదరికంలో మగ్గిపోయారు. ఈ మత్స్యకారులకు వడ్డీ వ్యాపారస్థుల నుండి, మధ్యవర్తుల నుండి రుణం తీసుకొనుట పరిపాటై పోయింది. వీరి బలహీనతను ఆధారంగా తీసుకొని ఈ మధ్యవర్తులు మత్స్యకారులు రోజంతా చేమటోడ్చి కష్టపడి సంపాదించిన చేపలను తప్పుడు తూకాలతో అతిచౌక ధరలకు కొనుగోలు చేసేవారు. ఈ మత్స్యకారులు తమకు మిగిలిన చేపలను అమ్ముటకు ఒక క్రమబద్ధమైన బజారుగాని, అనువైన రవాణా సదుపాయాలుగాని లేవు. తత్ఫలితంగా, మత్స్యకారులు విసిగివేసారి తమ చేపలను దళారీలు నిర్ణయించిన ధరలకే అమ్మివేయుట జరిగేది. ఇంతేకాక అనాదిగా మత్స్య పారిశ్రామికులు తెరచాప నావలు, మసులా పడవలు, దోనెలు, సంగడములు, తెప్పలు, మావులు, ఈతలతో, ఇందుకనువైన ప్రత్తినూలు వలలతో చేపలవేట గావించి కాలంగడుపుతూ వచ్చారు. మత్స్యకారుల ఆర్థిక సామాజికజీవనం వృద్ధిచేసి జాతీయ జీవనస్రవంతిలో వీరికి సముచిత స్థానం కల్పించాలనే సముద్దేశంతో మనరాష్ట్ర ప్రభుత్వం 1974 మే నెలలో ఒక బృహత్తర సంస్థను స్థాపించింది. ఈ సంస్థ దేశావసరాలకూ, జాతీయాభివృద్ధికీ, సమాజ సంక్షేమానికీ, దానితో పాటు ఈ మత్స్యకారుల నిరుపేద జీవితాలలో దీప కాంతులు వెదజల్లుతున్నది. ఇంకొక మాటలో చెప్పాలంటే ఈ సంస్థ దేశ ప్రగతిపథంలో ఒక మైలురాయి వంటిది.

## ఆశయాలు, కార్యక్రమాలు

ఆంధ్ర ప్రదేశ్ ఫిషరీస్ కార్పొరేషన్ లిమిటెడ్ యొక్క రిజిస్టర్ కార్యాలయం కాకినాడలోనూ, ప్రాంతీయ కార్యాలయం విశాఖపట్నంలోను స్థాపించబడి 1974 అక్టోబర్ 1నుండి పనిచేయడం ప్రారంభించింది. దీని క్రింద అనేక సేకరణ కేంద్రాలు (Procurement Centres) పనిచేయుచున్నవి. ఈ కార్పొరేషన్ ఎప్కార్ (APCOR) అను సంక్షిప్త నామంతో 3 కోట్ల రూపాయల అధికారిక పెట్టుబడితోను 65.8 లక్షల రూపాయల చెల్లించిన పెట్టుబడితోను నెలకొల్పబడింది. దీనితోపాటు ఈ సంస్థకి కేనింగ్ ఫ్యాక్టరీ, పడవల నిర్మాణం కాకినాడలోను; శీతలీకరణ ఫ్యాక్టరీ విశాఖపట్టణంలోను; ఐస్-కమ్-కోల్డ్ స్టోరేజ్ప్లాంటు పాడల, నెల్లూరు, హైదరాబాద్లలోను స్థాపించుటకు రూ. 9.33 లక్షల చెల్లింపు పెట్టుబడికూడా మంజూరు చేయబడినది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, విజయ బ్యాంకు లిమిటెడ్, సిండికేట్ బ్యాంకు, ఆంధ్రా బ్యాంకు లిమిటెడ్, కెనరాబ్యాంకు వంటి బ్యాంకులు ఈ కార్పొరేషన్కి తగిన ధన సహాయం అప్పుగా ఇవ్వడానికి ముందుకు వచ్చినవి.

ఈ కార్పొరేషన్ యొక్క ప్రధాన ఆశయాలు రెండు. మొదటిది, శ్రీకాకుళం జిల్లాలో పెన్నేటిపేట, అలతాడు, నువ్వుల రేవు, బారువ; విశాఖపట్నం జిల్లాలో విశాఖపట్నం; తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ; పశ్చిమ గోదావరి జిల్లాలో సూర్యాలంక నిజాంపట్నంలలో తమ సేకరణ కేంద్రాలద్వారా మత్స్యకారుల నుండి చేపలను సరసమైన ధరలకు కొని, వారిని దళారీల

దారుణ దోపిడీనుండి రక్షించడం. రెండవది, మర పడవలను తయారుచేసి మత్స్యకారులకు సరఫరాచేసి సముద్రంలోని రొయ్యలను, విలువైన చేపలను భారీ ఎత్తున వెలికి తీయడం. ఈ విధంగా కార్పొరేషన్ రెండు ప్రధాన ఆశయాలు కలిగివున్నది.

## పరిపాలనా యంత్రాంగం

ఈ కార్పొరేషన్ కాకినాడలోనున్న ప్రధాన కార్యాలయం ద్వారా పని చేస్తున్నది. మత్స్యకారులనుండి నేరుగా చేపలను కొనుగోలు చేయుటకు క్రింది స్థాయిలో మత్స్య సేకరణ కేంద్రాలు నెలకొల్పారు. కార్పొరేషనకు సంబంధించిన విధానాలను నిర్ణయించుటకు, కార్యక్రమాలను సక్రమంగా నిర్వర్తించడంలో తోడ్పడుటకు ప్రధాన కార్యాలయంలో ఒక అధ్యక్షుడు (Chairman), ప్రధానాధికారి (Managing Director) వుంటారు. ఈ కార్పొరేషన్ ప్రాంతీయ కార్యాలయం చీఫ్ అకౌంటెంట్ ఆఫీసర్‌కి సహాయ పడుటకు ఒక మార్కెటింగ్ ఆఫీసర్, కొందరు పాలక సిబ్బంది వుంటారు. మత్స్యకారులనుండి చేపలను కొనుటకు కొనుగోలు అధికారి కొనుగోలు కేంద్రంలో చేపల కొనుగోలుకు తగిన ఏర్పాట్లు చేస్తాడు. తన వివిధ కార్యక్రమాలను నిర్వర్తించుటకు, ప్రస్తుతం ఈ కార్పొరేషన్ 410 మంది ఉద్యోగులను కలిగివున్నది. ఈ కార్పొరేషన్ వ్యాపార దృక్పథం కలిగివున్నప్పటికీ దీనియొక్క కార్యక్రమాలను ఈ క్రిందివిధంగా విభజించవచ్చును. అవి వరుసగా పడవలను తయారుచేయుట, చేపలుపట్టుట, చేపలను తాజాగా వుంచుట, ఐసును తయారుచేయుట, కేనింగ్, వలలు తయారుచేయుట, మారుమూలల్లో చేపల బజారులను ఏర్పాటు చేయుట, మర పడవలకు ఫ్యూయల్ ఆయిల్ సరఫరా చేయడం, కందెన వేయడం, రొయ్యలను విదేశాలకు ఎగుమతి చేయడం, రడీ-టు-ఈట్ ఫిష్ మీల్ కుక్కీస్ తయారు చేయడం.

## పడవల నిర్మాణ కేంద్రం

ఈ కేంద్రం పరిమితమైన కార్యక్రమాలతో ప్రారంభించబడి క్రమంగా తన కార్యక్రమాలను విస్తృత పరచుటకు తగిన కృషిని సల్పింది. ఇప్పుడు ఈ కేంద్రం అన్నివిధాలా సామర్థ్యం పుంజుకొంది. ప్రస్తుతం ఈ కేంద్రం 300 మంది ఉద్యోగులను కలిగివున్నది. ప్రతి సంవత్సరం 60 పడవలు తయారు చేయగల స్తోమత కలిగివున్నదంటే చాలా గర్వింపదగిన విషయం. 1975 డిసెంబర్, వరకు ఫిషరీస్‌శాఖ అవసరాలకు సరిపోయినన్ని పడవలను మాత్రం ఈ కేంద్రం తయారు చేయగలిగేది. విశాఖపట్నంలో ఫిషింగ్ హార్బర్ నిర్మాణం పూర్తికావడంతో ఈ కేంద్రం రూపురేఖలు మారటయేకాక ఎక్కువ సంఖ్యలో పడవల నిర్మాణానికి ఒత్తిడి అధికమైంది. ఈ కార్పొరేషన్ యొక్క పడవల నిర్మాణ కేంద్రం దీన్ని అవకాశంగా తీసుకొని నాణ్యమైన పడవలను సరసమైన ధరలకు ఉత్పత్తి చేస్తోంది. దాంతో ఈ కేంద్రం ఎంతో ప్రగతి పలుకుబడి సాధించింది. ఇప్పుడు ఈ కేంద్రం తన అంచనాలకంటె అధికసంఖ్యలో పడవలను ఉత్పత్తిచేయుటకు పూనుకొంటున్నది. 1975-76 సంవత్సరంలో, ఈ కేంద్రం 51.17 లక్షల రూపాయిలు విలువగల పడవలను తయారుచేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ కేంద్రం కార్పొరేషన్ ప్రగతికి తన అడుగు కూడా కలుపుతోంది.

## జింక్ ప్లాంట్

ఈ పరిశ్రమ ప్రతిరోజూ 20 టన్నుల ఐసును ఉత్పత్తి చేయగలుగుతున్నది. చేపలను పాడవకుండా తాజాగా వుంచుటకు దీని ఉపయోగం ఎంతైనా వుంది. ఇది రోజు ఒక్కంటికి నాలుగు టన్నుల రొయ్యలను ఫ్రీజ్ చేసి పాశ్చాత్యదేశాలకు తాజా రొయ్యలను ఎగుమతిచేసి అధికమైన లాభం పొందుటకు కార్పొరేషన్ సహాయకారిగా వుంది. ప్రతీరోజు 50 టన్నుల చేపలను ఫ్రీజ్ చేయగలుగుతున్నది. ఈ సంస్థకు ఫ్రీజింగ్ ప్లాంట్స్ అవసరం రోజురోజుకీ అధికమవుతుండడంతో కాకినాడలో రెండవ ఫ్రీజింగ్ ప్లాంట్‌లు శరవేగంతో నిర్మించబడుతున్నది.

## ఐస్ ప్లాంట్స్

కార్పొరేషన్ ప్రతి ఐస్‌ప్లాంటునూ ఒక సూపర్‌వైజర్, మెకానిక్, ముగ్గురు ఐస్‌డంపర్స్ నిర్వహిస్తున్నారు. వీటిద్వారా తయారైన ఐసును ఈ కార్పొరేషన్ మత్స్యకారులకు సరఫరాచేసి, వారియొక్క ఆర్థిక స్తోమతను పరోక్షంగా పెంచుతున్నది. ఐస్ అవసరం మత్స్యకారులకు, కార్పొరేషన్ యొక్క మత్స్యగిడ్డంగులకు ఎక్కువగా ఉండటంతో హైదరాబాదు వద్ద మరొక ఐస్‌ప్లాంట్ నిర్మించుటకు ప్రయత్నం జరుగుతున్నది.

## కేనింగ్ ఫ్యాక్టరీ

ఈ ఫ్యాక్టరీ 8 గంటల కాలంలో 1000 పౌన్లు కేన్‌డ్ ఫిష్‌ను తయారుచేయగల శక్తి కలిగివున్నది. ఈ కేన్‌డ్‌రొయ్యలు, చేపలు సైనికుల సంస్థలకు సరఫరా, విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నవి. అంతేకాక ఈ ఫ్యాక్టరీ యొక్క ఉత్పత్తిని పెంచి, తద్వారా ప్రజలకు కేన్‌డ్ చేపలను సరసమైన ధరలకు అందించుటకు కార్పొరేషన్ సంకల్పించింది. వీటితో సహా ఈ ఫ్యాక్టరీ ఎండుచేపలు, ఉప్పుచేపలను కూడ తయారుచేస్తున్నది. వీటిని గిరిజన కార్పొరేషన్ ద్వారా మారుమూల గిరిజన ప్రాంతాలకు సరఫరా చేస్తున్నది.

## ఫిషింగ్ ఆపరేషన్

కాకినాడ, విశాఖపట్నం రేవులలో కార్పొరేషన్ 20 మర పడవల నుపయోగించి సముద్రజలాలలో చేపలను చాలామట్టుకు కొల్లగొట్టుటకు తన శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నది. మత్స్యకారులు వారి వృత్తిలో నైపుణ్యం పొందుటకు, ఆధునిక సాంకేతిక పనిముట్లు వుపయోగించుటలో అనుభవం పొందుటకు కార్పొరేషన్ కాకినాడలో యువకులైన మత్స్యకారులకు తర్ఫీదు ఇస్తున్నది. ఈ తర్ఫీదు పొందిన మత్స్యకారులకు కార్పొరేషన్, మరపడవలు సరఫరా చేసి వారి జీవన స్రవంతిని వృద్ధిపరచి, తద్వారా జాతీయాదాయం మెరుగుపరచుటకుగాను అహర్నిశలు పాటుపడుతున్నది. 1975-76 సంవత్సరంలో ఈ సంస్థ పట్టిన రొయ్యలు, ఇతర విలువైన చేపల ఖరీదు 10.06 లక్షల రూపాయిల విలువకు చేగ

కొన్నది. మరపడవలలో పనిచేయు సిబ్బందికి (Crews), ఇంధనమునకు అయ్యే ఖర్చు 8.71 లక్షల రూపాయిలు పోగా, ఈ సంస్థకు 1.35 లక్షల రూపాయలు లాభం వచ్చింది. ఈ కార్పొరేషన్ 80 లక్షల రూపాయలు విలువచేసే ట్రాలర్స్‌ను మెక్సికో నుండి దిగుమతి చేసుకొంటుంది.

## మార్కెటింగ్

మొదట్లో కార్పొరేషన్ చేపలను కమీషన్ పద్ధతిలో హైదరాబాదులోని బేగంబజారులో విక్రయించేది. ఈ పద్ధతివల్ల కార్పొరేషన్, మత్స్యకారుల యొక్క కనీసావసరాలను తీర్చడంలో విఫలమైంది. ఈ కారణంచే 1975 సెప్టెంబర్ 1వ తేదీ నుండి తన సొంత అమ్మక కేంద్రాలను హైదరాబాదు, విజయవాడ, ఏలూరు, గుంటూరులలో స్థాపించి తన వ్యాపారాభివృద్ధికి శక్తి కొద్దీ ప్రయత్నిస్తున్నది.

ఈ కార్పొరేషన్ వ్యాపార దృక్పథంతో స్థాపించబడ్డప్పటికీ మత్స్యకారుల యోగక్షేమములపై కూడా తగిన శ్రద్ధ వహించుట ముదావహం. ముఖ్యంగా దళారీ బెడదనుండి అభం శుభం ఎరుగని మత్స్యకారులను కాపాడగలుగుతున్నది. చాలామంది మత్స్యకారులు వారి వృత్తికి కావలసిన పనిముట్లు లభించకపోవుటచే వారివారి వృత్తులను విడిచిపెట్టి జీవనాధారంకోసం రైతుకూలీలతో, రిక్షాపుల్లర్లతో పోటీ పడుతున్నారు. మత్స్యకారులు పనులులేక దారుణ కష్టాలకు గురైయ్యారు. కార్పొరేషన్ వీరిని ఈ క్లిష్టపరిస్థితులలో ఆదుకొని వారికి తగిన జీవనోపాధి కల్పించింది. ఉదాహరణకు స్త్రీలకు ఫిషరీస్ యూనిట్‌లలో పనులు కల్పించి వారిని ప్రోత్సహించింది. వీరు ఏర్పాటు చేసిన ఫిషరీస్ శాఖవీటి అ నరంకల మత్స్యకారులకు సరసమైన ధరలకు అమ్ముటకు ముందుకు వచ్చింది. ఈనాడు మన సోదరులైన మత్స్యకారులు నైలాన్ వలలతో మరపడవల నుపయోగించి అధిక చేపలను పట్టి వారి ఆర్థిక, సామాజిక జీవనం గణనీయంగా వృద్ధిపరచుకోగలిగారంటే దానికి ఆంధ్రప్రదేశ్ ఫిషరీస్ కార్పొరేషన్ నిర్వహిస్తున్న సముచితపాత్ర కారణం అని చెప్పవచ్చును. ఈ కార్పొరేషన్ మొత్తం పట్టిన చేపలను 16 శాతం వాటాని మరపడవల్లో పనిచేసే సిబ్బంది (Crews) కి పంచిపెట్టి వారిని ప్రోత్సహిస్తున్నది.

దేశ ఆర్థిక పురోభివృద్ధిలో కూడా దీని నిర్మాణాత్మకమైన పాత్ర తక్కువైనదేమీకాదు. ఉదాహరణకు ఇప్పటి వరకు విదేశాలకు రొయ్యలను ఎగుమతిచేసి, దాదాపు కోటి రూపాయలు విలువచేసే విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించింది. జపాన్, అమెరికాల యందు ఈకార్పొరేషన్ అత్యున్నతమైన పేరుప్రతిష్ఠలు గడించటంతో అనేక దేశాలనుంచి కొల్లలు కొల్లలుగా ఆర్డర్లు పొందుతున్నది. ఇట్లు వుల్లాస పూరితమైన ప్రోత్సాహంతో కార్పొరేషన్ అధిక శక్తిని పుంజుకొంటూ తన వ్యాపారాన్ని, సాంఘిక సేవలను అన్నిదిశలా అధిక తేజస్సుతో మరింత విస్తృతపర్చాలని అర్రులుచాస్తూంది. విశాఖపట్నం బీచ్‌వద్ద స్థాపించిన ఫిష్‌కేంటీన్ దీనికి ఉదాహరణంగా పేర్కొనవచ్చు. మరపడవల వాడకానికి డీసెల్ ఆయిల్ చాలా అవసరం. విశాఖపట్నంలోని ఫిషింగ్ హార్బర్ నడుపుతున్న మరపడవలకి అవసరమైన డీసెల్ ఆయిల్‌ను న్యాయమైనధరలకు అమ్ముటకు కార్పొరేషన్ కంకణం కట్టింది. దీనికై డీసెల్ బంకులను నెలకొల్పి మరపడవలు ఆటంకం లేకుండా పనిచేయుటకు కావలసిన డీసెల్ ఆయిల్, బ్రేక్ ఆయిల్, గ్రీజ్ మొదలైన ఇంధనములను కార్పొరేషన్ సరఫరా చేస్తున్నది. 1976 జూలై 28వ తేదీ, 1977 మార్చి 31వ తేదీ మధ్యకాలంలో కార్పొరేషన్ 21 లక్షల లీటర్ల ఆయిల్‌ను మరి కొన్ని రకాల కందెనలను విక్రయించటం గర్వింపదగ్గ విషయం.

కానీ మరీ క్షుణ్ణంగా పరిశీలిస్తే ఈ కార్పొరేషన్ చేపడుతున్న శ్రేయోదాయక కార్యక్రమాలు ఇంకా చాలవనిపిస్తుంది. పెట్టుబడి సమృద్ధిగా లేకపోవడంచేత ఈ కార్పొరేషన్ చేపట్టిన కార్యక్రమాలు బాగా కుంటుపడటం జరుగుతోంది. ముఖ్యంగా మత్స్య పారిశ్రామికులను, అనాదిగా పాతుకుపోయిన దురుద్దేశ పూరితులైన వడ్డీ వ్యాపారస్థుల, దళారీల క్రూర హస్తాలనుండి కార్పొరేషన్ రక్షించాల్సివుంది. కాబట్టి కార్పొరేషన్ సర్వవిధాలా తన సేవలను విస్తృత పరిచి మత్స్య పారిశ్రామికుల జీవితాల్లో క్రొత్త పోకడలు సృష్టించడానికి అకుంఠిత దీక్షతోపాటు పడాలి. ఒకవైపు మత్స్యకారుల జీవితాలను మూడు పువ్వులు, ఆరు కాయలుగా వికసించుటకు, మరొకవైపు కార్పొరేషన్ తన అభ్యుదయం సాధించుటకు ఈ క్రింద సూచించిన సలహాలు పాటించడం అవసరం. ఈ కార్పొరేషన్ ప్రజల అవసరాలను, ముఖ్యంగా మత్స్యకారుల యొక్క అవసరాలను గుర్తించి, వాటిని తీర్చుటకు అనుగుణంగా తన విధానాలను రూపొందించవలసివుంది. ప్రాతఃకాలం నుండి సంధ్యాసమయం వరకు శ్రమించే మత్స్య పారిశ్రామికులు తింటానికి తిండి, కట్టటానికి బట్టలేక అలమటిస్తున్నారంటే దళారీల అమానుష కృత్యాలే ప్రబలకారణం. కాబట్టి వారిని అరికట్టుటకు ఈ కార్పొరేషన్ తక్కువ వడ్డీలతో మత్స్యకారులకు రుణములనిచ్చే తగిన పథకాన్ని చేపట్టాలి. కార్పొరేషన్ ప్రస్తుతయిస్తున్న ధరలను పెంచి మత్స్యకారుల యొక్క చేపలకు సరసమైన ధరలు లభించేలాచేసి వారికి లాభం చేకూర్చాలి. తమ విదేశీ ఎగుమతులను విస్తరింపచేయటానికి తగిన చర్యలు తీసుకోవాలి. సముద్ర తీర ప్రాంతం వెంబడి నివసిస్తున్న మత్స్య పారిశ్రామికులచేపలకు తగినమార్కెటింగ్ సౌకర్యాలను కల్పించుటకు వీరిగ్రామాలను పట్టణాలతోను పెద్దపెద్ద గ్రామాలతోను కలిపేందుకు అనువుగా రోడ్లను నిర్మించాలి. మారుమూలగ్రామంలో నివసించే మత్స్య కార్మికులకు అందుబాటులో వుండేలా మత్స్య సేకరణ కేంద్రాలను విస్తరింపజేయాలి. ఈ కార్పొరేషన్ యొక్క ఆశయాలు విజయవంతంగా చేయుటకు తగిన సాంకేతిక సామగ్రి, శిక్షణ పొందిన సిబ్బంది ఎంతైనా అవసరం. ఈ కార్పొరేషన్ యొక్క సిబ్బంది సమర్థవంతమైన పరిపాలనా దక్షతను పెంపొందించుకోవాలి. ఈ కార్పొరేషన్ యొక్క సిబ్బంది సాంకేతిక పరిజ్ఞానమును కలిగియుండుటయేకాక, మత్స్య కారులను సాంఘికంగా, ఆర్థికంగా పురోగమింపజేయుటకు వారి యొక్క ఆచార వ్యవహారాలను క్షుణ్ణంగా తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

# "శ్రీకాకుళమ్ము నిర్జిత నాకలోకమ్ము"

— శ్రీ ఆదిభట్ల వెంకటరమణ

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు దేశంలో వెనుకబడిన ప్రాంతాలలో శ్రీకాకుళాన్ని చేర్చి షట్సూత్ర పథకంక్రింద, ఆర్థిక కార్యక్రమాలక్రింద అభివృద్ధికి పూనుకొన్నప్పటినుండి జిల్లా ప్రజల జీవన ప్రమాణంలోసత్వర పరిణామం కలుగుతున్నదని చెప్పక తప్పదు.

ఈ జిల్లాలలో బలహీన వర్గాలుగా హరిజనులు, గిరిజనులు, షెడ్యూలుకులాలు, జాతులవారు, మత్స్య పారిశ్రామికులు, సన్నకారు రైతులు ఎన్నబడుతున్నారు. వీరి అభివృద్ధికి ప్రభుత్వం చేపట్టిన పథకాలు ఈ జిల్లాలో ఎలా అమలు జరుగుతున్నాయో చూడాలి.

జిల్లా అభివృద్ధి కృషివల్ల మత్స్యపారిశ్రామికులు పొందుతున్న అభివృద్ధి గణనీయంగా ఉంది. వీరి కష్టానికి తగ్గ ఫలితం సాగర గర్భం అందిస్తున్నది. అనంతమైన సాగర సంపదను వీరు సాధించి పేదవారు పెద్దవారుగా అవుతున్నారు. బ్యాంకులు వీరికిచ్చిన రుణాలు తీర్చెయ్యగలుగుతున్నారు. సన్నకారు రైతులకంటె ఎస్.ఎఫ్.డి.ఏ వలన వీరు లాభించేరు. ఒక లక్ష ఏబదివేలమంది మత్స్య పారిశ్రామికులకు ఈ సంస్థ మేలు చేకూర్చింది. నూట మూడు మత్స్య పారిశ్రామిక గ్రామాలను కార్పొరేషన్ క్రిందకు తేవడం జరిగింది. 55 మెరైన్ ఫిషర్‌మెన్ కో-ఆపరేటివ్ సొసైటీలు కేటాయించడం కూడా అయింది. ఇంతవరకు 3470 మంది మత్స్య పారిశ్రామికులకు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ చేపలుపట్టే ఆధునిక పరికరాలను పంచింది. 11 లక్షల 61 వేల రూపాయిలను సబ్సిడీలుగా ఇచ్చింది. వీరికి బ్యాంకులు 45 లక్షల రూపాయిలు రుణాలుగా ఇచ్చేయి. ఏ జిల్లాలోను జరగనంత సహకారాన్ని ఈ జిల్లాలో మత్స్య పారిశ్రామికులు పొందేరు. ఇందువల్ల ఒకటిన్నరకోట్ల రూపాయలు విలువగల రొయ్యలు అనే చేపజాతిని విదేశాలకు ఎగుమతి చెయ్యడం జరుగుతున్నదని తెలుస్తున్నది

మిగులు భూమిని భూమిలేని బలహీన వర్గాలకు పంచడం ఈ జిల్లాలో 90,342 మంది బడుగు వర్గాలకు లక్ష పదహారువేల రెండువందల ఇరవై మూడు ఎకరాల తొంబది సెంట్లు పంచడం లక్ష్యం-ఇందులో 23,679 ఎకరాల 70 సెంట్లు విస్తీర్ణంగల భూమిని షెడ్యూల్ కులాలవారికి 6,521 మందికి, గిరిజనులకు 7,740 మందికి, ఇతర వెనుకబడిన వర్గాలవారికి 2964 మందికి మొత్తం 17,225 మందికి పంచడం జరిగింది.

## ఇండ్ల స్థలాలు పంపకం

ఇండ్లులేని నిమ్నజాతుల వారికి ఇండ్ల స్థలాలు పంచిపెట్టే కార్యక్రమం క్రింద జిల్లాలో చెప్పుకోదగ్గ కృషి జరిగింది. ఈ జిల్లాలో 1,809 గ్రామాలలో 23,380 మంది ఇండ్లులేని పేదలు ఉన్నారని సర్వేలో తేలింది. 1975-76 సంవత్సరంలో వీరికి యిండ్ల స్థలాలకు భూమి సేకరించడానికి 6,32,500 రూపాయిలు కేటాయించారు. గత సంవత్సరం ఇండ్ల స్థలాలకు భూమిసేకరించడానికి రూ. 19.28 లక్షలు ఖర్చుచేసేరు. 708.92 ఎకరాల భూమిని కూడా సేకరించేరు. ఇందులో 7019 మంది షెడ్యూల్ తరగతుల వారికి, 1400 మంది గిరిజలకు 274 మంది విముక్తజాతుల వారికి, 2,062 మంది వెనుకబడిన తరగతుల వారికి ఇండ్ల స్థలాలు పంచుతారు. 1976-77 సంవత్సరంలో 15 వేలమంది ఇండ్లు లేని పేద వర్గాల వారికి 50 లక్షల రూపాయిల ఖర్చుతో వెయ్యి ఎకరాల స్థలం సేకరిస్తారు. షెడ్యూల్ తరగతులవారికి 10 లక్షలు గిరిజనులకు 10 వేలు, విముక్తజాతుల వారికి 2 వేలు రూపాయిలు ఇళ్ళ స్థలాలకు ప్రభుత్వం ఖర్చుచేస్తుంది.

వెట్టి చాకిరీ నిర్మూలన కార్యక్రమం క్రింద పార్వతీపురం, సాలూరు, నరసన్నపేట, పాతపట్నం తాలూకాలలో 5 గురుని భూకామందుల *పంజా నుండి విముక్తులను గావించడం*, వారి క్షేమానికి సహాయం చేయడం జరిగింది.

ఈ జిల్లాలో గిరిజనుల సంక్షేమం చూడడానికి గిరిజనాభ్యుదయ సంస్థ గిరిజన సహకార సంస్థ, చిన్న రైతులకు ఎస్.ఎఫ్.డి.ఏ, నిమ్నజాతుల సంక్షేమానికి జిల్లానిమ్న జాతుల సేవాసహకార సంస్థ వెనుకబడిన వర్గాల వారికి వెనుకబడిన తరగతుల ఆర్థిక సహకార సంస్థ పనిచేస్తున్నాయి. రుణములు మంజూరు చేయడానికి షెడ్యూలు బ్యాంకులచే రుణాలు ఇప్పించి మధ్యవర్తిగా పనిచేస్తున్నాయి.

## ఎస్.ఎఫ్.డి. ఏ. పథకాలు

ఈ జిల్లాలో సన్నకారు రైతుల అభివృద్ధికి ఎస్.ఎఫ్.డి.ఏ. సంస్థ బాగా పని చేస్తున్నట్లు ప్రశంసలు పొందింది. 1970–71 సంవత్సరంలో ప్రారంభింపబడిన ఈ సంస్థకు కేంద్రం తన సహాయనిధి నుండి 1.50 కోట్ల రూపాయిలు ప్రారంభ ఖర్చులకు ఇచ్చింది. 1975 జూలై నుండి 76 మే నెల చివరకు 23903 మంది రైతులు లాభం పొందేరు. వీరికి వివిధ పథకాల క్రింద 180.16 లక్షల రూపాయిలు ఖర్చు చేసేరు.

ఇదికాక 12,43,100 రూపాయిల సహాయానికి రాష్ట్ర సహకార సంఘ రిజిస్ట్రార్‌కి, 1,28,100 రూపాయిలు సహాయంచేయమని లేబరు కాంట్రాక్టు సహకార సంఘము వారికి నివేదిక పంపారు.

## రైతులకు రుణాలు

స్వల్పకాలిక రుణాల క్రింద ఈ జిల్లాలో రైతులందరికి 21 కోట్ల రూపాయిలు మంజూరు చేయడం జరిగింది. దీనిలో వ్యవసాయ శాఖ రుణాలు ఒకకోటి, శ్రీకాకుళం, విజయనగరం సహకార సంఘాలద్వారా 15 కోట్లు, షెడ్యూల్ బ్యాంకుల ద్వారా 5 కోట్లు మొత్తం 21 కోట్లు రుణం యిస్తారు.

ఈ డబ్బులో 60% సన్నకారు రైతులకు, 5% మధ్య తరహా రైతులకు, మిగిలిన 35% గిరిజనులకు, ఇతర వ్యవసాయదారులకు ఉపయోగిస్తారు.

సాంఘిక సంక్షేమరంగంలో ఈ జిల్లాలో బలహీన వర్గాల విద్యార్థులకు రాష్ట్రసాంఘిక సంక్షేమశాఖ 140 వరకు వసతి గృహాలు నడుపుతున్నది. అందులో 694 మంది విద్యార్థులున్నారు. ఇందులో బాలబాలికలకు ఉమ్మడి వసతి గృహాలు 56, విద్యార్థుల నిర్వహణలో ఉన్నవి 8, కాస్మాపాలిటన్ భోజనశాలలు 8, గిరిజన వసతి గృహాలు 18, గిరిజన కన్యాశ్రమం ఒకటి, ఆశ్రమ పాఠశాలలు 49 ఉన్నాయి. వీటికి 1,012 క్వింటాళ్ళ బియ్యం, 62 క్వింటాళ్ళ పంచదార, కోటా సప్లయి చేస్తున్నారు.

విద్యార్థులకు పుస్తకాలు పంపిణీకి ఒక విద్యాశాఖ నివేదికనుబట్టి చూస్తే 1975–76 సంవత్సరంలో 16,483 మంది గిరిజన విద్యార్థులకు జాతీయం చేయబడిన వాచక పుస్తకాలు ఉచితంగా పంచినట్లు, 500 మంది విద్యార్థులకు 3500 నోట్సు పుస్తకాలు, 500 పలకలు ఉచితంగా సప్లయి చేసినట్లు తెలుస్తున్నది.

శిక్షణ కేంద్రాలలో బలహీన వర్గాల వారికి శిక్షణ ఇవ్వడానికి షెడ్యూలు కులాల సేవా సహకార సంఘము శ్రీకాకుళంలో 20 మందికి 75రూపాయిలుస్టయిఫండ్ యిస్తూ వడ్రంగం శిక్షణ కేంద్రం నెలకొల్పింది. భద్రగిరిలో చేనేతశిక్షణా కేంద్రాన్ని 13మంది షెడ్యూలు కులాల బాలురకు శిక్షణ ఇవ్వడానికి నెలకొల్పారు. శ్రీకాకుళంలో కాంట్రాక్టు కో ఆపరేటివ్ సొసైటీ చిన్న కంట్రాక్టులు చేసికొనే శిక్షణ గరిపే కేంద్రాన్ని నెలకొల్పింది. బొబ్బిలి, శ్రీకాకుళం పట్టణాలలో చేనేత మగ్గముల తొక్కుడు శిక్షణా కేంద్రాలు 32, బాలబాలికలకు 2,62,700 రూపాయిల పెట్టుబడితో ప్రారంభించారు. శ్రీకాకుళం చేనేత దుస్తుల తయారీ శిక్షణకేంద్రాన్ని నెలకొల్పేరు. ఇదికాక గిరిజన ప్రాంతాలలో, చౌక బియ్యం డిపోలు ఎరువుల డిపోలు, కంట్రోలు వస్త్రాల దుకాణాలు, కోళ్ళపెంపకం కేంద్రాలు ఏర్పాటు చేశారు. ఆహార వస్తువుల సరఫరా కేంద్రాలలో గిరిజన, హరిజన యువకులనే ఉపాధికై కూడా నియమించడం జరిగింది.

## ఉపాధి పథకాలు

పాడి పశువులు, గొర్రెలు, పందుల పెంపకానికి చిన్న పరిశ్రమలు, వ్యాపారం పెట్టడానికి వెనుకబడిన వర్గాల వారికి 40,80,144 రూపాయిల పథకాన్ని రూపొందించేరు. దీనివల్ల 4380 మంది లబ్ధి పొందేరు. తీర ప్రాంతంలో బెస్తవారి సౌకర్యం కోసం ఇచ్ఛాపురం తాలూకా మాకృపురంలో, టెక్కలి తాలూకా వజ్రపు కొత్తూరు, అక్కుపల్లి, సోంపేట తాలూకా బారువ, కొత్తూరులలో చౌక బియ్యం డిపోలు నెలకొల్పేరు.

కంచలి గ్రామంలో కొబ్బరి పీచు, కొబ్బరి నూనె మొదలగు పరిశ్రమలు నెలకొల్పే పథకం 5,04,325 రూపాయిల ఖర్చుతో రూపొందింది. ఇచ్ఛాపురం, సోంపేట, కోస్తా గ్రామాలలో కొబ్బరి తోటలు పెంచెడి కార్యక్రమం కొనసాగుతోంది. 26 వివిధ పశు సంవర్ధక కార్యాలయాలలో కోళ్ళ పెంపకం కేంద్రాలు నెలకొల్పుతున్నారు.

## ఇతర పథకాలు

ఇదికాక ఇంకా ఇతర పథకాల క్రింద 5688 గ్రామాలకు ఉపయోగ పడేటట్లు 58 లక్షల ఖర్చుతో వివిధ పరిశ్రమలను నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇదికాక నిత్యావసర వస్తువుల షాపులు 10, రసాయనిక ఎరువుల షాపులు 20, బట్టల కొట్లు 3, రివాల్వింగు నిధి 4 లక్షల రూపాయిలతో వెనుకబడిన వర్గాలవారికి ప్రారంభించేరు. 2661 మందికి 26 లక్షల 72 వేల 7 వందల రూపాయల ఖర్చు కాబోయే పథకాల క్రింద దుక్కిటెద్దులు, బండెద్దులు, భూమి అభివృద్ధి, పాడి పశువులు, పందులు, గొర్రెలు, కోళ్ల పెంపకం కార్యక్రమాలు చేబడుతున్నారు. కేంద్రం ఆరు సూత్రాల పథకం క్రింద 1974–79 వరకు నాలుగున్నర కోట్లు మంజూరు చేసింది.

శ్రీకాకుళం జిల్లాలో ఈ ఊపున సాగుతే పదేండ్లలో ఈ జిల్లా ముందుకిబాగా వస్తుంది,కృష్ణా, గోదావరి జిల్లాలతో సమానం చేసి తీరుతామని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళ రావు చేసిన ప్రకటన కార్యరూపంలో ఉంది.

బాల బాలికల సంక్షేమం కోసం :

# బాలల అకాడమీ బృహత్తర కృషి

—శ్రీమతి జె. ఎస్. లక్ష్మి

పిల్లలు మల్లి మొగ్గలు. వారివి అమాయక హృదయాలు. కల్లాకపటం తెలియని ఆ పసిపాపలను ఏ విధంగానైనా మలచవచ్చు. ఈ నాడు వారి జీవితాలను తీర్చి దిద్దడానికిగాను వేసిన పథకాలపై దేశ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. సుశిక్షితులైన పౌరులుగా, విషయ పరిజ్ఞాన, విజ్ఞాన సంపన్నులుగా చేసే బాధ్యత సమాజంపై ఉంది. మొన్న మొన్నటివరకు సమాజం సమిష్టి కుటుంబమే ప్రాతిపదికగా, పునాదిగా ఉంటున్న కారణంగా కుటుంబంలో ముసలివారో, అనుభవజ్ఞులైన కుటుంబ సభ్యులో పిల్లల పోషణకు ప్రత్యేక శ్రద్ధ వహించేవారు. పిల్లలకు కాకమ్మ కథలు చెబుతూ వారిలో విజ్ఞానంపట్ల జిజ్ఞాసను పెంపొందించటానికి దోహదం చేసేవారు. కాలం దొర్లేకొద్దీ నాగరికత పెరుగుతూ వస్తున్నది. సహజీవనానికీ, సహకార దృక్పథానికీ, నిలయమైన సమిష్టి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమవుతున్నది. చిన్న చిన్న కుటుంబాలు ఈనాడు సమాజంలో చోటుచేసుకుంటున్నాయి. కుటుంబాలు విడిపోవటంవల్ల బాలబాలికల పట్ల పోషణ ఉంటున్నప్పటికీ, తగిన శ్రద్ధ చూపించలేకపోతున్నారు. పిల్లల తల్లిదండ్రులు. ఇదివరలో పిల్లలకు నేర్పే పాటలు చాలా వరకు ముఖతా వచ్చినవే. అవి గ్రంథస్థం కాలేదు. పెద్ద తరానికీ ప్రస్తుత కుటుంబాలకు అగాథం ఏర్పడటంవల్ల ఆ పాటలు మరుగున పడిపోతున్నాయి.

బాలబాలికలకు సులభంగా అర్థమయే సాహిత్యం చాలా తక్కువగా ఉంది. ఉన్న సాహిత్యమైనా చాలావరకు అశాస్త్రీయమైనదే. బాలసాహిత్యంలో శాస్త్ర విజ్ఞానం చోటు చేసుకొనాలి. ఈ నాటి బాలబాలికల్లో శాస్త్ర విజ్ఞాన పఠనాభిలాష, ఆసక్తి అలవడవలసి ఉంది. అందుకు శాస్త్ర విజ్ఞానాన్ని వివరించే సాహిత్యం ఎంతో అవసరం.

పిల్లలకు విషయ పరిజ్ఞానం సులభంగా అర్థం కావాలంటే ఆకర్షణీయంగా చిత్రీకరించబడిన బొమ్మలతోకూడిన పుస్తకాలు కావాలి. కళలపట్ల ఆసక్తి కలిగిన బాలబాలికలు ఆ వొంకరలు పెంపొందించటానికి వారికి దోహదం చేయాలి.

స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లో సమాజ వికాస కార్యక్రమాలు ప్రారంభించినప్పుడు శిశు, సంక్షేమ కార్యక్రమాలను ప్రోత్సహించడానికిగాను ప్రభుత్వం ముఖ్య సేవికలను, గ్రామ సేవికలను నియమించి వారి సేవలను అందజేసింది. వారు బాలబాలికలకోసం బాలానంద సంఘాలను ఏర్పాటుచేసి, వారికి సాంకేతిక సలహాలు యిస్తుండేవారు. సమితులు, జిల్లా పరిషత్తు, కేంద్ర సాంఘిక, సంక్షేమ మండలి ఆర్థికసహాయం అందచేస్తుండేవి. ప్రజలు కూడా విరాళాలిస్తుండేవారు. బాలానంద సంఘాలు వేసవి శిబిరాలను, ఆటలు, పాటలు, లలిత కళలు తదితర పోటీలను నిర్వహిస్తూ బాలబాలికలను ప్రోత్సహిస్తూ వచ్చేవి. గ్రామాలలో బాలానంద సంఘాలు ఏర్పాటు అయినా, వాటిని సమన్వయంచేసే సంస్థ లేకపోవటంవల్ల, ఏ సాంకేతిక లోపంవల్లనైనా కార్యక్రమాలు సరిగా నిర్వహించకపోతే విమర్శకు గురి అయేవి. అందువల్ల కార్యకర్తలలో నిరుత్సాహంవచ్చి మూతపడుతూ వచ్చాయి. ఈ విధంగా ఈ నాడు చాలావరకు బాలానంద సంఘాలు పనిచేయడం లేదు. గ్రామీణ ప్రాంతాలలో బాలానంద సంఘాలు సరిగా పనిజేయని కారణంగా బాలబాలికల్లో అణగారిఉన్న శక్తులు వెలికి తీసుకొనివచ్చే బాధ్యత





బాలల మహాసభ ప్రారంభోత్సవం

వహించే సంస్థలు లేకపోవటంవల్ల పట్టణ ప్రాంత బాల బాలికలు, గ్రామీణ ప్రాంతం బాల బాలికలమధ్య అభివృద్ధి విషయంలో పెద్ద తేడా కనిపిస్తున్నది.

బాలసాహిత్యానికి సంబంధించిన కొన్ని పత్రికలు ఉన్నాయి. అయినా వాటిలో శాస్త్ర విజ్ఞానాన్ని పెంపొందించేవి తక్కువగా ఉన్నాయి. పైగా మిక్కిలి వ్యాపారదృష్టే వాటికి. బాలలకు సంబంధించిన గ్రంథాలయాలు, బాలలకు వినోదం కలిగించే బాలల చిత్రాలు తక్కువగా ఉన్నాయి. పిల్లలు హాబీలు పెంపొందించుకొనటానికి కావలసిన క్లబ్ లుకూడా లేవు. ఈ కార్యక్రమాలను నిర్వహించటం కుటుంబ పరంగాగాని, స్వచ్ఛంద సంస్థలపరంగా గాని కొంచెం కష్టమయిన పనే. ప్రభుత్వం సహాయసహకారాలు కలిగిన సంస్థగా ఉండాలి. ఈ సంస్థద్వారా సదస్సులు, సాంస్కృతిక ప్రదర్శనలు, బాలల సాహిత్య ప్రదర్శనలు ఏర్పాటు చేయటంద్వారా బాల బాలికల్లో అణగారిఉన్న లలిత కళల అభివృద్ధికి దోహదం జరుగుతుంది.

1974 వ సంవత్సరం అఖిల భారత బాలల మహాసభను ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిర్వహించింది. ఈ ఉత్సవాల నిర్వహణకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు ఎంతో ప్రోత్సాహం ఇచ్చారు. ఈ ఉత్సవాలవల్ల బాలల లోకంలో నవ చైతన్యం వెల్లివిరిసింది. ఈ ఉత్సవాల సందర్భంగా జరిగిన చర్చలలో బాలల వికాసానికి రాష్ట్రస్థాయి సంస్థ ఏర్పాటుచేయాలని ప్రభుత్వాన్ని ఉత్సవాల సంఘం అభ్యర్థించింది. దాని ఫలితంగా బాలల విజ్ఞాన వినోద కార్యక్రమాల నిర్వహణ విషయంలో సమర్థవంతంగా పర్యవేక్షించటానికి, వివిధ కార్యక్రమాలను సమన్వయం చేయటానికిగాను ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఆవిర్భవించింది. ఈ బాలల అకాడమీకి విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు అధ్యక్షులు, మహిళా, శిశు సంక్షేమ శాఖా మంత్రిణి శ్రీమతి దామోదరం కృష్ణవేణి సంజీవయ్యగారు ఉపాధ్యక్షులు సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి శ్రీ అంతటి నరసింహం గారు ఆర్థికవిషయాల సలహాదారు, రేడియో అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు కార్యదర్శి, శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ సంయుక్త కార్యదర్శి శ్రీ ఎమ్. సూర్యనారాయణ (మసూనా), శ్రీ బి. వి. నరసింహారావు, శ్రీమతి టి. శాంతాబాయి, శ్రీ జలగం ప్రసాదరావ్, డాక్టర్ పి. తిరుమలరావు గారు, జవహర్ బాలభవన్ డైరెక్టర్ శ్రీ వై. గోపాలరావు సభ్యులుగా ఒక సంఘం ఏర్పాటు చేయబడి ది. ఈ బాలల అకాడమీ 1976 వ సంవత్సరం మార్చి నెలలో నెలకొల్పబ డింది. మార్చి నెలలో వెలసిన బాలల అకాడమీకి అప్పటి రాష్ట్రపతి కీ. శే. ఫకృద్దీన్ అలీ అహమ్మద్ ప్రారంభోత్సవం చేశారు.

## బాలల మహాసభ నిర్వహణ

ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలను బాలల అకాడమీ దేశం మొత్తంమీద ప్రప్రథమంగా విజయవంతంగా నిర్వహించి ప్రశంసలు అందుకొంది అని అంటూ బాలల అకాడమీ జాయింట్ సెక్రటరీ శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ గారు బాలల మహాసభల విశేషాలను వివరించారు. ఈ బాలల మహాసభలు 1977 సంవత్సరం ఫిబ్రవరి 10 వ తేదీ నుంచి 13 వ తేదీవరకు నిర్వహించింది, బాలల అకాడమీ. ఈ మహాసభకు 108 బాల ప్రతినిధులు, 191 మంది సహాయకులు, 90 మంది బాల సంఘాల ప్రతినిధులు, తొమ్మిది మంది ప్రత్యేక ఆహ్వానితులు మొత్తంమీద 698 మంది హాజరయ్యారు.

నగరం నడిబొడ్డున ఉన్న నారాయణగూడాలోని కేశవ మెమోరియల్ హైస్కూలు ప్రాంగణంలో ఈ బాలల మహాసభలను ఏర్పాటు చేసింది. ఈ బాలల మహాసభకు ఆర్థిక శాఖ పూజీ మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డిగారు జ్యోతి వెలిగించి ప్రారంభోత్సవం చేశారు. మహిళా, శిశు సంక్షేమ శాఖా మంత్రి శ్రీమతి డి. కృష్ణవేణి సంజీవయ్యగారు వస్తు, పుస్తక, చిత్రప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. ఈ మహాసభల సందర్భంగా ప్రత్యేక సంచికను అప్పటి భాషాకమీషన్ సంఘాధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆవిష్కరించారు.

బాల సాహిత్యం, బాలవిజ్ఞానం, బాల సంక్షేమం తదితర అంశాలపై సదస్సులు జరిగాయి. సదస్సులో పాల్గొన్నవారు బాలల సంక్షేమం కోసం ఎన్నో సూచనలు, సలహాలు ఇచ్చారు.

1976 సంవత్సరం నవంబరు 14 వ తేదీ జిల్లా స్థాయిలో గేయరచన, వ్యాసరచన, నృత్యం, వక్తృత్వం, వర్ణచిత్రం, నాటికలు, లలిత సంగీతం మొదలైన పోటీలు బాలల అకాడమీ నిర్వహించింది. జిల్లా స్థాయిలో ప్రథమ బిరుదులు అందుకొన్న వారి నందరిని ఆహ్వానించి రాష్ట్రస్థాయిలో ఆయా పోటీలు పెట్టాం. ఈ పోటీలను సీనియర్, జూనియర్, సబ్ జూనియర్ వర్గాలకు విడివిడిగా పెట్టి బహుమతులను ఈ మూడు తరగతులవారికి వేరు వేరుగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు ఇచ్చాం. ఈ విధంగా రాష్ట్రస్థాయిలో ప్రతిభావంతులైన బాలబాలికలకు బహుమతులిచ్చి ప్రోత్సహించడం ఇదే ప్రథమం. రాష్ట్రం మొత్తం



బాలల అకాడెమీ కార్యకలాపాల్లో పాలుపంచుకుంటున్న గవర్నరు.

మీద ఈ సందర్భంగా బహుమతులు యివ్వడమయింది. ఈ విధంగా బాలబాలికల్లో ఉన్న ప్రతిభావ్యుత్పత్తులను వెలికి తెచ్చే బృహత్తర కార్యక్రమాన్ని మా బాలల అకాడమీ విజయవంతంగా నిర్వహించింది. ఈ పోటీలలో వేలాదిమంది బాలబాలికలు పాల్గొన్నారు ఈ బాలల మహాసభలు సందర్భంగా ఏర్పాటు చేసిన చిత్ర ప్రదర్శనలో వందలాది బాలబాలికలు వేసిన బొమ్మలు ప్రదర్శించబడ్డాయి. వేలకొలది జంట నగరాలలోని బాలబాలికల హృదయాల్లో ఆనందపు జల్లులు కురిపించాయి ఈ మహాసభలు" అని వివరించారు.

## ఆంధ్రప్రదేశ్ దర్శన్

బాలల అకాడమీ బాలలకు ఇంకొక పథకాన్ని కూడా అమలు పరచి ఎంతో మ ది బాలబాలికలు పాల్గొనడానికి దోహదం చేసిందని అంటూ ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి ఈ బాలల అకాడమీ ఆర్థిక సలహాదారులైన డాక్టర్ అంతటి నరసింహంగారు ఆ పథకం గురించి ఇలా వివరించారు: "ఆ పథకానికి ఆంధ్రప్రదేశ్" దర్శన్ అని విద్యాశాఖా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు పేరు పెట్టారు. ఈ పథకానికి వ్యూహా రచయిత వారే. వారి పథకాన్ని బాలల అకాడమీ ఆమోదించి మన రాష్ట్రంలో వున్న ప్రతిభావంతులైన బాలబాలికలను ఎన్నిక చేసుకొని రాష్ట్రంలోని ఆర్థిక, సాంస్కృతిక, పారిశ్రామిక ప్రాధాన్యం కలిగిన ప్రదేశాలు వారికి చూపించి సమగ్ర ఆంధ్రప్రదేశ్ సందర్శనం ద్వారా వారిలోనూ, వారిద్వారా ప్రాంతీయ సంకుచిత భావాలకు స్వస్తి చెప్పించటమే మా బాలల అకాడమీ పెట్టినతల ఈ పథకం ప్రధాన లక్ష్యం.

ఈ పథకాన్ని రూపకల్పన చేయడంలో అప్పటి జవహర్ బాలభవన్ డైరెక్టర్ శ్రీ గోపాలరావుగారు ఎంతో కృషిచేశారు.

ఆంధ్రప్రదేశ్ దర్శన్ పథకం క్రింద వివిధ జిల్లాలో జిల్లా విద్యాశాఖాధికారుల సహకారంతో బాలబాలికలకు పరీక్షలు నిర్వహించ



మహాసభల సందోహం

బడినాయి. ఎస్.సి.ఇ.ఆర్.టి. చరిత్ర విభాగపు అధిపతి శ్రీ జి. సూర్యనారాయణమూర్తి గారి ఆధ్వర్యంలో ఈ పరీక్ష పత్రాలను దిద్దటం జరిగింది. ఈ పోటీలో 1500 మంది బాలబాలికలు పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద జిల్లాకు ఇద్దరు చొప్పున 42 మందిని ఎన్నుకొన్నాం. జంట నగరాల్లో ఇద్దరిని ఎన్నిక చేసుకొని జిల్లాలనుంచి ఎన్నుకొన్నవారిలో సగం మంది గ్రామ ప్రాంతానికి చెందిన వారయితే సగం మంది పట్టణ ప్రాంతానికు చెందినవారు. ఈ 44 మందే కాకుండా బాలల మహాసభల సందర్భంగా జరిగిన ప్రతిభాపోటీలలో నెగ్గిన ప్రథమ బహుమతి గ్రహీతలను ఎనిమిది మందిని, ఉత్సాహవంతంగా పనిచేసే బాలానంద సంఘాల నుంచి కొంత మంది బాల కళాకారులను ఎన్నుకొన్నాం.

32 రోజుల వ్యవధిలో 21 జిల్లాల సందర్శన చేసేలా ఒక కార్యక్రమాన్ని రూపొందించాం. మహిళా శిశు సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య గారు ఈ ఆంధ్రప్రదేశ్ దర్శన్ పర్యటన కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు. 1977 సంవత్సరం మే నెల 12వ తేదీన ఈ యాత్రను ప్రారంభించాం. రెండు డీలక్సు బస్సులలో మొత్తం 6500 కిలో మీటర్ల దూరాన్ని ఈ బాల బాలికలను త్రిప్పాం. 60 సుప్రసిద్ధ ప్రదేశాలను చూపించాము. అందులో ర్యాలి, పాలంపేట, ( రామప్ప ) అమరావతి, మంగళగిరి, రాజమండ్రి, శ్రీ కాళహస్తి, శ్రీశైలం, కొలనుపాక, యాదగిరి గుట్ట, భద్రాచలం, పిల్లలమర్రి, శాలిబండ, లేపాక్షి మొదలైన యాత్రా స్థలాలను వారు సందర్శించారు. పోచంపాడు నాగార్జునసాగర్, లోయర్ సీలేరు, మైలవరం ఆనకట్టలను వారు చూశారు. పటాన్ చెరువు, తాడేపల్లి గూడెం, విజయవాడ మొదలైన ప్రదేశాల్లో అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలను వారు పరిశీలించారు.

శ్రీహరికోట రాకెట్ కేంద్రం, విజయవాడలో పత్రిక కార్యాలయం, రాజమండ్రి బ్రిడ్జి, రుషివేలీ పబ్లిక్ స్కూల్, కోరుకొండ సైనిక్ స్కూల్, మదనపల్లి ఆరోగ్యకేంద్రం, కూచిపూడి సిద్దేంద్ర కళాక్షేత్రం, భీమునిపట్నం, అరకు, ప్రకృతి దృశ్యాలు, రామగుండం విద్యుదుత్పాదక కేంద్రం, విజయనగరం, బొబ్బిలికోటలు, కాకినాడ పడవల నిర్మాణ కేంద్రం, నెల్లూరు మైకా గనులు, సంగారెడ్డిలోని పండ్ల పరిశోధనా క్షేత్రాన్ని కూడా బాల బాలికలు సందర్శించారు. సుప్రసిద్ధ సినీ నటులు శ్రీ ఎన్. టి. రామారావు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు తదితరులతో సమావేశాన్ని చేశారు. విజ్ఞానదాయకమైన ఈ యాత్ర విజయవంతంగా ముగిసింది. ఈ ఆంధ్రప్రదేశ్ దర్శన్‌లో పాల్గొనటానికి అవకాశంలేని లక్షలాది బాలల ప్రయోజనం కోసం ఈ విజ్ఞాన యాత్రను సినిమాగా తీయటమయింది. ఈ పథకం వల్ల వేలాది బాల బాలికలు ఉత్తేజం పొందారు. అని డాక్టర్ అంతటి నరసింహం గారన్నారు.

బాల బాలికల్లో విజ్ఞాన వికాసాలు కలుగ జేయుటకుగాను "బాల" పత్రికను ప్రారంభించి బాలల అకాడమీ ఈ బాల పత్రికకుగాను సంపాదక సమితిని ఏర్పాటు చేసింది. ఈ సమితిలో డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు, డాక్టర్ అంతటి నరసింహం, డాక్టర్ అడపా రామకృష్ణారావు, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు, శ్రీమతి తురగా జానకీరాణి, చిరంజీవి మండలి బుద్ధ ప్రసాద్, శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్, సమావేశ కర్త సాంకేతిక సహాయాన్ని టెక్స్టుబుక్ ప్రెస్ డిప్యూటీ డైరక్టర్ శ్రీ జి. రామకృష్ణారావు గారు అందజేస్తున్నారు.

రేడియోద్వారా, బాలానంద సంఘాలు స్థాపించి దాని ద్వారా విశేషంగా సేవచేసిన అప్పటి "బాల" పత్రిక సంపాదకుడు శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి ఈ 'బాల' పత్రిక సంపాదకులు. గత ఏడు మాసాలుగా ఈ పత్రిక ప్రచురిస్తున్నారు. పాత పద్ధతులలో కథలను ప్రచురించడమే కాకుండా ఇంకా ఎక్కువగా శాస్త్ర విజ్ఞానాన్ని పెంపొందించే శీర్షికలను ప్రవేశపెట్టి బాలలకు శాస్త్ర విజ్ఞానం పట్ల ఎక్కువ ఆసక్తి, అభిరుచి కలుగచేస్తే ఎంతో బాగుంటుంది. ఆ నాడే 'బాల' పత్రిక ధ్యేయం నెరవేరినట్లు అవుతుంది.



నాగార్జున కొండకుపయనం

# గోదావరి నదిపై పోలవరం ప్రాజెక్టు

శ్రీ బి. యల్. సత్యనారాయణశాస్త్రి

ది. 30-9-1977 న తమ తూర్పు గోదావరి జిల్లా పర్యటన సందర్భములో కత్తిపూడి గ్రామములో ఆంధ్రా బ్యాంక్ వారి సహాయంతో ఏర్పాటు చేయబడిన సన్నకారు రైతుల సహాయ కేంద్రమునకు ప్రారంభోత్సవము చేస్తూ ప్రభుత్వము గోదావరి నదిపై పోలవరం ప్రాజెక్టు నిర్మాణం చేపట్టి శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి కృష్ణా జిల్లాలలోని మెట్ట తాలూకాలకు నీటి పారుదల సౌకర్యం కలుగ జేయనున్నదని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికై సంవత్సరమునకు 40 కోట్ల రూపాయలు కేటాయించి మొత్తం ప్రాజెక్టు ఐదు సంవత్సరముల కాలంలో పూర్తి చేయుటకై పథక రచన సాగుతున్నదని కూడా అన్నారు. విశాఖపట్టణంలో నెల కొననున్న ఉక్కు కర్మాగారం, తదితర భారీ పరిశ్రమల దృష్ట్యా గోదావరి జలాలను సత్వరమే విశాఖపట్టణానికి తరలించవలసి వున్న కారణంచేత ఈ ప్రాజెక్టుకు విశేష ప్రాధాన్యం ఇవ్వబడు తోందని చెప్పారు.

సుమారు 200 కోట్ల రూపాయలతో పోలవరం ప్రాజెక్టు నిర్మాణానికి ప్రభుత్వం అంగీకరించడం ఆంధ్రప్రదేశ్ ఉజ్జ్వల భవితవ్యానికి మరొక్క పునాది. ఉత్తరాంధ్ర ప్రజలు వేయి కళ్ళతో ఎదురు చూసిన శుభ ఘడియ ఆధునిక ఆర్థికాభివృద్ధిక ముఖ్యాధారాలు నీరు, విద్యుచ్ఛక్తి. గోదావరి కోటి ఎకరాలకు నీటి పారుదల ఒనగూర్చగల మహానది. ఆంధ్రప్రదేశ్ ఈనాటి విద్యుత్ అవసరాలలో సగ భాగం పండించి పెట్టగల నదీమ తల్లి. అటు వంటి నది కొర్టు పాలయింది. గోదావరి నదీ జలాలు రెండు దశాబ్దాలు సముద్రం పాలవుతూ వచ్చాయి.

గోదావరిపై పోలవరం వద్ద నీటి పారుదల పథకం, ఇచ్చంపల్లి వద్ద 1,000 మె. వా. శక్తిగల జలవిద్యుత్ కేంద్రం నిర్మాణమైతే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆర్థిక వ్యవస్థ సర్వతో ముఖాభి వృద్ధి గాంచగలదు.

ప్రకృతిమాత ఆంధ్ర ప్రజలకు జీవనాధారములగు కృష్ణా, గోదావరి నదులనిచ్చి కటాక్షించినది. భారత దేశంలో నీటి వనరుల ఉపయోగములో గంగానదీ పరీవాహక ప్రదేశము గొప్ప దయినప్పటికీ అది నాలుగు రాష్ట్రములకు వ్యాపించి యున్నది కాని ఉపయుక్తములైన కృష్ణా, గోదావరి నదుల నీటి వనరులు ఒక్క ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోనే కలవు.

ఒక శతాబ్దికి పూర్వము రాయల్ ఇంజనీరింగు సర్ ఆర్థర్ కాటన్ యొక్క దూరదృష్టి వలన కృష్ణా, గోదావరి నదులలోని కొద్ది పాటి నీరు డెల్టా జిల్లాలగు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో నీటి పారుదలకు వినియోగములోకి తేబడింది. ఈ కార్యము వలననే పై జిల్లాలలోని డెల్టా తాలూకా లలో నేటి వ్యవసాయ సంపద పెంపొందినది. గోదావరి ఆనకట్ట క్రింద 10 లక్షల ఎకరములకు, కృష్ణా బ్యారేజి క్రింద 12 లక్షలఎకరములకు నీటి పారుదల జరుగుతున్నది. కాని ఈ నదులను వినియోగించుకొనుటకు కృష్ణా, గోదావరి ఆనకట్టల నిర్మాణానంతరం ఒక శతాబ్దం వరకు ఎట్టి చర్య గైకొనబడలేదు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత తుంగభద్రపై డామ్ నిర్మాణం, కృష్ణానదిపై నాగార్జునసాగర్ నిర్మాణం చేపట్టబడినది. గోదావరిపై 20 లక్షల ఎకరములకు నీటిపారుదల కలిగించుటకు ఉద్దేశింపబడి నిర్మాణములో నున్న పోచంపాడు ప్రాజెక్టు మినహా యేయితర ప్రాజెక్టులు రాష్ట్రంలో లేవు. కాని పోచంపాడు కావల గోదావరికి ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, ఉపనదులు కలవు. ఈ ఉపనదుల నీటినికాని ఈ ఉప నదులతో కూడుటచే దక్షిణ భారత దేశములో పెద్ద నదియగు గోదావరి నీటినిగాని దిగువ ప్రాంతములో వినియోగములోనికి తేలేదు. అందుచే గోదావరి నదిలోని 90 శాతం అమూల్యమైన తియ్యని నీరు ప్రతి సంవత్సరము నిరుపయోగముగా బంగాళాఖాతములో కలిసి పోతోంది ఈ నదిలో సగటున ఉండు 9480 టి.యం.సి. (వేయి మిలియను ఘనపుటడుగులు) నీటిలో 5 శాతము మాత్రమే సర్ ఆర్థర్ కాటన్ చే ఊహింపబడి, కట్టబడిన ధవళేశ్వరం ఆనకట్టగుండా వినియోగములోనున్నది.

నిరుపయోగముగా ప్రవహించు నీటిలో ప్రతి చుక్కను మనము ఆకట్టినచో సుమారు కోటి ఎకరములకు నీటి పారుదల సౌకర్యం కలుగచేయవచ్చును. ప్రకృతి యొసగిన ఈ గొప్ప బహుమతిని మనము ఉపయోగించుకొనాలి.

గోదావరి దాని ఉపనదులు ఈ క్రింద చూపబడిన విధముగా నీటిపారుదల సౌకర్యం కలిగించగలవు.

| క్రమ సంఖ్య | ప్రాజెక్టులు | ఎకరములు |
|---|---|---|
| 1) | గోదావరి నదిపై ధవళేశ్వరం ఆనకట్ట | |
| | ప్రథమ పంట | 10,00,000 |
| | ద్వితీయ పంట | 5,00,000 |
| 2) | మంజీరపై నిజామ్‌సాగర్ ప్రాజెక్టు | 3,00,000 |
| 3) | పోచంపాడు ప్రాజెక్టు | 20,00,000 |
| 4) | ఇచ్చంపల్లి ప్రాజెక్టు | 15,00,000 |
| 5) | రామపాదసాగర్ బ్యారేజ్ (పోలవరం ప్రాజెక్టు) | 15,00,000 |
| 6) | పోచంపాడు, ఇచ్చంపల్లి, రామపాదసాగర్ ప్రాజెక్టుల క్రింద లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా ద్వితీయ పంట | 10,00,000 |
| 7) | ఇతర రాష్ట్రములలోని ప్రాజెక్టులు | 22,00,000 |
| | ఎకరములు | 1,00,00,000 |

(తరువాయి 23 వ పేజీలో)

# పోలియో నివారణకు ఆంధ్ర వైద్యుని అపూర్వ పరిశోధన



ఆంధ్రప్రదేశ్‌కు చెందిన కృష్ణా జిల్లా గుడివాడలోని డాక్టరు గురురాజు ప్రభుత్వ హోమియోపతిక్ మెడికల్ కాలేజీలో వైద్యశాస్త్ర అధ్యాపకులు డాక్టరు తాళ్ళూరి శివరామ కృష్ణయ్య స్వయంగా పరిశోధించి పోలియో దాని నివారణ కోసం కనుగొన్న మందు ప్రపంచాన్ని దిగ్భ్రాంతిని కలిగిస్తున్నది.

పోలియో రాకముందు, ఇకపై అది సోకకుండా వుండే నిమిత్తం ప్రస్తుతం మందు వున్నది. కాని, పోలియో వచ్చిన పిదప కొన్ని సంవత్సరాల క్రితం వచ్చినా సరే—దానిని నివారించగలిగిన మందు ఇంతవరకు ఏ వైద్య విధానంలోను లేదు. ఇప్పుడు డాక్టరు తాళ్ళూరి శివరామ కృష్ణయ్య దశాబ్ది పాటు పరిశోధించి, రెండేళ్ళపాటు ప్రయోగాలు చేసి, కడచిన ఏణ్ణర్థంగా వాడుతున్న మందు పోలియో నివారణలో అత్యంత ఆశ్చర్యకరమైన ఫలితాలను సాధిస్తూ వేలాది మంది రోగులకు వరప్రసాదమైనది.

ఇది ఏలా సాధ్యమని వైద్య శాస్త్రవేత్తలు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తున్నారు.

పోలియోకి ముఖ్యకారణం వైరస్. ఇది యింటీరియర్ హార్న్ సెల్స్‌ను ఎఫెక్ట్ చేస్తుంది. అందువల్ల మోటార్ నెర్వ్ సిస్టం దెబ్బతింటుంది. దీనితో ఆయాభాగాలు పని చేయవు. అదే పోలియో.

ఒక సారి నెర్వ్ సెల్ దెబ్బతింటే అది తిరిగి బాగుపడడం అసంభవం అనే పాత విశ్వాసమే యీ ఆశ్చర్యానికి కారణం.

ఈ వాదనను డాక్టరు శివరామ కృష్ణయ్య తమ పరిశోధనా ఫలితాల ద్వారా త్రోసిపుచ్చారు. దెబ్బతిన్న నెర్వ్ సెల్‌ను బాగు చేసి తిరిగి యథా ప్రకారం పని చేయించవచ్చునని ఆయన నిరూపిస్తున్నారు.

ఆయన కనుగొన్న ఈ సరిక్రొత్త మందును వాడడంవల్ల పోలియోకి గురయి మెత్తగా దూదివలె అయిన కండరాలు తిరిగి గట్టి పడుతున్నాయి. వ్యాధికి లోనయిన అవయవాలు మరల

---

శ్రీమతి అన్నపూర్ణ

---

మామూలు అవయవాలవలె పని చేస్తున్నాయి. వ్యాధికి గురయిన అవయవాలు సన్నబడడం లేదు. సన్నబడిన భాగాలలోని కండలు తిరిగి లావవుతున్నాయి. ఇదే పోలియో నివారణ అంటే.

మృతప్రాయమైపోయిన కండరాలకు తిరిగి జీవితాన్ని ప్రసాదించడమే అమృతతుల్యమైన ఈ మందు చేస్తున్న పని. ఇది పరమాద్భుతం.

పోలియో చిన్న పిల్లలకు సోకే మహా భయంకరమైన వ్యాధి. జ్వరం, విరోచనాలు వచ్చి తగ్గిన తరువాత ఈ వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. కాళ్ళు, చేతులు, మెడ, గుండె చచ్చుబడి పోతాయి.

డాక్టరు శివరామ కృష్ణయ్య దృష్టిలో పోలియో అసలు వ్యాధే కాదు, వ్యాధి దుర్లక్షణం మాత్రమే. ఇది అంటువ్యాధి వంటిది.

డాక్టరు శివరామ కృష్ణయ్య ఆధ్వర్యాన తొలిగా గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో పోలియో నివారణ కేంద్రాన్ని తెరచి

పోలియో సోకిన పిల్లలకు తమ మందును ఇవ్వడం ప్రారంభించారు. అయా శరీర తత్వాలు, పోలియో లక్షణాలు, సోకిన కాల వ్యవధిని బట్టి ఏడెనిమిది రకాలుగా మందులను వాడతారు. అయితే ఉపయోగించేది ఒక్క మందునే. పైన పసరు పూస్తారు. కొలతలు తీసుకొని ఎప్పటికప్పుడు రికార్డు చేస్తుంటారు. మల, మూత్రాదులను, రక్తాన్ని పరీక్షిస్తుంటారు. కరెంట్ పెడతారు.

చిలకలూరిపేట కేంద్రానికి వందలు, వేల సంఖ్యలో వస్తున్న పోలియో వ్యాధి గ్రస్థులను చూస్తుంటే దేశంలో యింతమంది పోలియో వ్యాధిగ్రస్థులు వున్నారా అని ఆయనకే ఆశ్చర్య మేసింది.

పోలియో వల్ల బాధ పడేది ఒక్క రోగిమాత్రమే కాదు, ఆరోగిని సాకేవారు కూడా.

ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన అన్ని జిల్లాలనుంచే కాక తమిళనాడు, కర్ణాటక, ఒరిస్సా రాష్ట్రాల నుంచి కూడా రోగులు రావడం ప్రారంభించారు. వారికి రాను పోను ఛార్జీలకు, ఇతర ఖర్చులకు వ్యయభారం తలకు మించిన వ్యవహారం కాగలదని భావించిన డాక్టరు శివరామకృష్ణయ్య దేశంలోని వివిధ ప్రాంతాలకు తామే వెళ్ళి పోలియో రోగులకు సేవ చేయవలెనని కృత నిశ్చయులయ్యారు.

ప్రస్తుతము డాక్టరు శివరామకృష్ణయ్య పర్యవేక్షణలో కృష్ణా జిల్లా విద్యావనం, విజయవాడ, పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు, భీమవరం, తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రి, విశాఖపట్టణం, ఖమ్మం, హైదరాబాదుల్లో కేంద్రాలను తెరచి విజయవంతంగా నిర్వహిస్తున్నారు.

విద్యావనం కేంద్రానికి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, హైదరాబాదు కేంద్రానికి ఆంధ్ర ప్రదేశ్ వైద్య, ప్రజారోగ్య శాఖ మాజీ మంత్రి శ్రీ కోదాటి రాజమల్లు ప్రారంభోత్సవాలు చేశారు.

ఇటీవలే మద్రాసులో కూడా పోలియో నివారణ కేంద్రాన్ని తెరిచారు. దీనికి సుప్రసిద్ధ చలన చిత్ర దర్శక-నిర్మాత, ఫాల్కే అవార్డు గ్రహీత, డాక్టరు బి. ఎన్. రెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

డాక్టరు శివరామకృష్ణయ్య సుమారు పాతిక మంది సిబ్బందితో, మందుమాకులతో, తగు పరికరాలతో, స్వంత వేన్‌లో వివిధ ప్రాంతాలకు తరలివెళ్ళి వైద్య సేవలు చేస్తున్నారు. ఆయనే ఒక సంస్థగా, మిషన్‌గా పని చేస్తున్నారు. ఈ విషయంలో ఆయన రేయింబవళ్ళను సయితం పరిగణించడం లేదు. పోలియో నివారణే ఆయన పరమ ధ్యేయం. పోలియో సోకిన వికలాంగులు ప్రపంచంలో ఒక్కరు కూడా మరి మిగిలి వుండరాదనేది ఆయన నినాదం.

ఎక్కుమంది పేదలకు ఉచితంగానే ఆయన మందులను ఇస్తుంటారు. ఇది ఆయన కారుణ్య హృదయానికి దర్పణం.

కుటుంబ సంక్షేమానికి ప్రభుత్వం ఎంత ప్రాధాన్యతను ఇస్తున్నదో పోలియో నివారణకు కూడా అంత శ్రద్ధనూ చూపవలెనని డాక్టరు శివరామకృష్ణయ్య విజ్ఞప్తి చేస్తుంటారు. దీనిని ప్రభుత్వం గమనించడం అవసరం.

డాక్టరు శివరామకృష్ణయ్య కృషిని, పరిశోధనలను, మందులను, ప్రభుత్వం గుర్తించి ప్రపంచ పరివ్యాప్తం చేయవలసిన ఆవశ్యకత ఎంతేని ఉన్నది.

ఏ పదార్థం రోగాన్ని సృష్టిస్తుందో అదే పదార్థం ఆరోగాన్నే నయం చేయగలదు కూడా అనే నిర్వచనం డాక్టరు శివరామకృష్ణయ్య వినూత్న పరిశోధనలకు మూలం.

మహా భయంకరమైన పోలియో వ్యాధిగురించి ప్రపంచం ఇప్పుడు భయపడవలసిన అవసరం లేదు. డాక్టరు శివరామకృష్ణయ్య వైద్యశాస్త్ర పరిశోధనల పుణ్యమా అంటూ అవ్యాధి నివారణకు తొలిగా మందు తయారైంది.

ఈ విషయంలో డాక్టరు తాళ్ళూరి శివరామకృష్ణయ్య తెలుగువారి మరొక యల్లా ప్రగడ సుబ్బారావు. ఆయనను డాక్టరు వాషింగ్టన్ కార్వేతో పోల్చవచ్చు, డాక్టరు హానిమన్ సరసన నిలపవచ్చు.

విశాఖపట్నం కేంద్రానికి ఆంధ్ర విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు, శాసన సభ్యులు శ్రీ ఎం. ఆర్. అప్పారావు ప్రారంభోత్సవం చేశారు.

న్యూఢిల్లీలోని కేంద్రానికి కేంద్ర ప్రజారోగ్య, కుటుంబ సంక్షేమ శాఖ మంత్రి శ్రీ రాజ్ నారాయణ్ అధ్యక్షతన భారత ఉప రాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి ప్రారంభోత్సవం చేశారు.

అక్కడ 1977 మే నెల 15 వ తేదీన జరిగిన అఖిలాంధ్ర శ్రీ అరవింద సొసైటీ మహా సభలో డాక్టరు శివరామ కృష్ణయ్యకు "ఆధునిక జీవక" బిరుదును ప్రదానం చేసి గౌరవించారు.

పిలిచిన ప్రతి చోటకు డాక్టరు శివరామ కృష్ణయ్య వెళ్ళి పోలియో వైద్యం, తాము కనుగొన్న మందు గురించి ఒక ప్రవక్తగా ప్రవచిస్తూ వుంటారు.

---

దేశానికి వెన్నెముక వంటి మన కోస్తాతీరం తుఫాను పెనుఘాతం పాలైంది.

ముఖ్యమంత్రి సహాయనిధికి ఉదారంగా విరాళాలివ్వండి.

---

# వంతెన నిర్మాణానికి వజ్రసంకల్పం

— శ్రీ ఎం. ఎస్. ఇస్మాయిల్

తూర్పుగోదావరి జిల్లా ముమ్మిడివరం తాలుకాకు చెందిన అయిలండు ఫిర్కా సుమారు 50 వేలు జనాభా కల్గియున్నను అచ్చట ప్రజలు వారిగ్రామములలో బస్సుగాని, కారుగాని, ఏరకమయిన యితర వాహనముకాని ఎక్కి యింకొక గ్రామానికి వెళ్ళుటకు నోచు కోలేదంటే, ఈ కాలములో అచ్చట ప్రజల సమస్యతెలియని వారికి చాల అతిశయోక్తిగ కనుపించకమానదు, ఆధునిక నాగరికత, ఐశ్వర్యసంపదలకూ ఆలవాల మయిన ఈ ఫిర్కా 12 గ్రామాలు రైలుకూత ఎరుగుట మాట అటుంచి, కనీసము ఎట్టి రవాణా సౌకర్యములు లేక అభ్యుదయపథంలో అట్టడుగున వుండడము మానవుడు చంద్రమండలముపై కాలు పెట్టిన ఈ యుగములో, నగుబాటే – కాని నైసర్గిక స్వరూపమునుబట్టి గౌతమి, వశిష్ఠ నదుల పాయలు, వైనతేయమునదులు పోయి (సముద్ర సంగమము) బంగాళా ఖాతములో కలియుటతో నాల్గువైపుల జలముతో నుండి మధ్యదీవిగా ఏర్పడినవి. పోలవరం దీవి ఫిర్కా గ్రామాలు. అన్నంపల్లి వద్ద అక్విడిట్‌ను నిర్మించి యీ దీవి గ్రామములకు కాలువలద్వారా నీరు సప్లయి చేయుటతో రెండు పంటలు పండించి రైతులు ఈ ప్రాంతమును సస్యశ్యామలముగ జేశారు. అయితే యింతవరకు జరిగినది వ్యక్తిగతమైన కృషియే, కాని యీ అర లక్షమంది జనాభాలో ప్రతివ్యక్తి మనస్సులో కార్యరూపము దాల్చకుండ వున్న కోరిక ఒక్కటే. అది అయిలండు 12 గ్రామాలు రవాణా, వైద్య విద్య, సౌకర్యములు ఏర్పడటానికి అవరోధముగ వున్న వృద్ధ గౌతమీ నదిపై వంతెన నిర్మాణము.

జాతీయ రహదారి మార్గంలేక పోవడంవలన కనీసం సరైన రవాణా సౌకర్యాలు సైతం కరువైన కారణంచేత అయిలండు ప్రాంత గ్రామాలు పురోభివృద్ధి చెందడంలేదని తెలిసిన స్థానిక శాసనసభ నియోజక వర్గ సభ్యులు, సమితి అధ్యక్షులు, గ్రామ సర్‌పంచ్‌లు లోగడ ప్రభుత్వమునకు విజ్ఞాపనలు చేస్తున్నప్పటికీ, అప్పట్లో అక్విడిట్ నానుకొని వంతెన నిర్మాణమును చేబట్టుటకు సాంకేతిక యిబ్బందులు కారణముచేతనో ధనాభావముచేతనో కార్యరూపము దాల్చలేక పోయింది.

నిస్పృహ, నిరుత్సాహముతో నిండిన అయిలండు గ్రామ ప్రజలు మే నెల 23 వ తారీఖున మురమళ్ళ, అయిలండు పోలవరము గ్రామములు దర్శించిన అప్పటి పంచాయతీ రాజ్ శాఖామాత్యులు శ్రీలుకలాపు లక్ష్మణదాసుగారికి తమగోడును విన్నవించగా వంతెన నిర్మాణమునకు ప్రజల సహకారము అందజేయ గలమని వాగ్దానము చేశారు. ఈ విషయమై జిల్లా కలక్టరు శ్రీ యు. బి.రాఘవేంద్రరావు గారితో వెంటనే సంప్రదించిన ఫలితముగా నిర్మాణ కృషిపై సంకల్పము కలిగింది.

అయిలండు ప్రాంత ప్రజల సమస్యలు అవగతము జేసుకొన్న జిల్లా కలక్టరు జూలై 8 వ తేదీన తొలిసారిగా అయిలండు సందర్శించ నున్నారని తెలుసుకొన్న పోలవరందీవి ప్రజలు శ్రీ రాఘవేంద్ర రావుకు మురమళ్ళరేవులో అమితోత్సాహంతో స్వాగతం పలికారు. మాజీ మంత్రి శ్రీరుద్రరాజు రామలింగరాజు, మంత్రి, స్థానిక శాసనసభ్యులు శ్రీ పళ్ళవెంకట్రావు, అమలాపురం M L A. శ్రీ కుడుపూడి ప్రభాకరరావు, ముమ్మడివరం మార్కెటింగ్ సొసైటీ అధ్యక్షులు శ్రీ ఆకాశం చిట్టిబాబు, ముమ్మడివరం లాండ్ మార్టిగేజ్ బ్యాంకు అధ్యక్షులు శ్రీ దంతులూరి చినరాంబాబు, సమితి మాజీ అధ్యక్షులు శ్రీ గాదిరాజు సూర్యనారాయణరాజు, శ్రీ ఆ కొండి సత్యన్నారాయణ, శ్రీ జి. వెంకటరెడ్డి, అయిలండు గ్రామ సర్పంచ్‌లు వంతెన నిర్మాణావశ్యకతను వివరించి, రైతుల తరపున పూర్తి సహకారము అందజేయగలమని కలక్టరుకు హామీయిచ్చారు.

వృద్ధ గౌతమీ నదిపై వంతెన నిర్మాణమునకు ఒక కోటి ఒక లక్ష రుపాయలు ఖర్చు కాగలదని, యిందులో ఎప్రోచ్ రోడ్లకు అగు ఖర్చు 30 లక్షల రూపాయలుపోను మిగిలిన 80 లక్షల రూపాయల ఖర్చులో ప్రజలు, రైతులు నాలుగోవంతు రూ. 20 లక్షలు భరించినట్లయితే అచిరకాలంలో ఈ ప్రాంత ప్రజల కోరిక నెరవేరి. సకల సదుపాయములు చేకూరి, ప్రాంతాభివృద్ధి చెందకలదని జిల్లా కలక్టరు బహిరంగసభలో ప్రకటించగా ప్రజలు హర్షధ్వా

నాలు ప్రభుత్వము అంగీకారమును తెలియ చేయడముతో వంతెన నిర్మాణమునకు నాంది వచనమును అయింది.

కలెక్టరు శ్రీరాఘవేంద్రరావు ప్రజల విరాళములు అతిసులభముగ అందజేయుటకు వీలుగ ఒక వినూత్న పథకమును రూపొందించారు. వెంటనే, ఈ మొత్తము రు. 20 లక్షల రూపాయలు మూడేళ్ళలో పల్లంభూమి ఎకరానికి రు. 35 లు, కొబ్బరితోట రు. 50 లు చొప్పున రైతులు చెల్లించుటకు ఈ నిధివసూళ్ళలో గ్రామాధికార్లు, సమితి బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, రివెన్యూ సిబ్బంది సహాయమును అందజేయుటకు ఒక కార్యక్రమమును అందజేశారు, ఉత్సాహవంతులైన రైతులు వెంటనే వసూళ్ళ కార్యక్రమము మొదలు పెట్టారు.

అంతటితో ఆగని జిల్లా కలెక్టరు అయిలండు గ్రామ సర్పంచుల సమావేశము జూలై 12 వ తారీఖున ఏర్పాటుచేసి నిధి వసూలు కార్యక్రమాన్ని సమీక్షించారు. కేవలం రెండు రోజులలో ఒక లక్షముప్పయిఐదువేల నూట అరవైఐదు రూపాయలు సేకరించబడినట్లు తెలియచేయడముతో ప్రజలలో వెల్లువగ వచ్చిన ఉత్సాహమునకు కలెక్టరు ముగ్ధులైనారు. 5 లక్షల రూపాయల విరాళము ప్రోగుచేసిన వెంటనే, వంతెన నిర్మాణమునకు శంకుస్థాపన చేయుటకు కృషి చేయగలనని కలెక్టరుగారు హామీయిచ్చారు కలెక్టరు విజ్ఞప్తిని పురస్కరించుకొని కేవలము పదిరోజుల వ్యవధిలో అయిలండు రైతులు తాము చెల్లించ వలసిన విరాళము మొదటి వాయిదా సొమ్ముగా రు. 5 లక్షల పదివేల మేరకు రివెన్యూ, పంచాయతీ సమితి సిబ్బంది. గ్రామాధికార్ల సహకారముతో వసూలుచేసి చెల్లించారు. దీనితో యిక వంతెన నిర్మాణము తప్పనిసరిగా వెంటనే చేపట్టబడుతోందని అందరిలో ఒక ప్రగాఢ విశ్వాసము కలిగింది.

ఈ విరాళములు వసూలుచేయుటలో ముమ్మిడివరం పంచాయితీ సమితి బ్లాకుడెవలపు మెంటు ఆఫీసరు శ్రీ యస్. రామచంద్రరావు కృషి, ఎంతైనా పేర్కొనదగింది. రు. 5 లక్షల విరాళము పూర్తిచేసిన తర్వాతనే నేను తిరిగి వెళ్ళగలను అని దృఢ సంకల్పముతో అయిలండు గ్రామములలో వున్న ఘనత వారికి దక్కుటలో వారిపాత్ర విదితము కాగలదు.

మురమళ్ళ, కేశనకుర్రు, అయిలండు పోలవరం, కొమరగిరి ఎదుర్లంక, యింజరం, గుతిందీవి, జి. వేమవరం, టి. కొత్తపల్లి, పశువుల్లంక, తాళ్ళరేవు, జి. పోలవరంతో కూడిన అయిలండు ఫిర్కా గ్రామములలో అయిలండు పోలవరం, మురమళ్ళ గ్రామములలో ఎక్కువ మొత్తములను వసూలుచేసి తమ ఆధిక్యతను చూపించారు అచ్చటి ప్రజలు.

అయిలండు గ్రామాల అభివృద్ధికి గౌతమీ నదిపై మురమళ్ళవద్ద వంతెన నిర్మాణము సాధ్యమగుటకు ప్రజలలో వచ్చిన ఉత్సాహము కలెక్టరు శ్రీ రాఘవేంద్రరావు కృషి సంఘటితమయ్యాయి. *

## ప్రకృతిని ఎదిరించాలి

కార్యశూరులారా ! ఓ ధైర్యశాలులారా !
రండిముందుకు ! ఇక జాగు యెందుకు ?

దిక్కులేని దీనులకు దిక్కును కల్పించండి
ఇల్లులేని పేదలకు ఇంత నీడ ఇవ్వండి
ఉప్పెనతో ఊళ్ళన్నీ తెప్పతేలిపోయాయి
వేల కొలది నిండైన ప్రాణాలే పోయాయి.

ప్రళయ తాండవం చేసిన ప్రకృతిని ఎదిరించాలి
వల్లకాడునే మళ్ళీ పల్లె లాగ మార్చాలీ
బాధపడే సోదరులను ఆదుకో ! సోదరా !
అనాధలను కాపాడే ఆ బాధ్యత నీదిరా !

—డా. దాశరథి

# ఆంధ్రసాహిత్యము : వేషధారణ

—డాక్టర్ నండూరి వేంకట సత్యనారాయణ రావు

(గత సంచిక తరువాయి)

గృహిణుల వేషధారణమును రేఖా మాత్రముగా చిత్రించిన ఘనత శ్రీ కృష్ణదేవరాయలకే దక్కినది. స్త్రీలు జలకమాడునప్పుడు పసుపు పూసికొనెడివారు. నీటి బిందెను చంకలోనిడికొని, చేతిలోని ఎఱ్ఱతామరలు బిందెలోనికి ఊగుచుండగా ద్రావిడ ప్రబంధములను చదువుచు చేరెడివారు. 'ఆముక్తమాల్యద' యందు చెప్పబడిన నీ విషయము ద్రావిడ స్త్రీలనుగూర్చి చెప్పబడినట్లున్నను, రాయల కాలమునాటి తెలుగు పడచుల చిత్రలేఖనమే యని యూహింపవచ్చును.

శయపూజాంబుజముల్ ఘటిం దడ బడన్ జనోయిలే గౌనుపై
దయ దప్పిన్ బసుపాడి, పాగడుపు బాదంబొప్ప జెంగల్వడి
గ్గియనీరచ్యుత మజ్జనార్థము గటింగీలించి, దివ్యప్రబం
ధయుగాస్యత్రద విదాంగనల్ నడుతు రుద్యానంపులోత్రవలన్

( ఆముక్త – ఆ1 – ప56)

శ్రీకృష్ణదేవరాయలు మాలదాసరి కండ్లకు గట్టునట్లాముక్తమాల్యదలో వర్ణించెను. మాలదాసరి చమురంటినతోలు చొక్కాయు, కుళ్ళాయియును ధరించెడివాడు. ఆరకూటమయములగు శంఖచక్రములవంటి పోగులను చెవులకు ధరించెడివాడు. పసుపు పట్టించిన కుఱుచయగు చర్మపు జన్నిదమును ధరించెడివాడు. గరుడ స్తంభము, చర్మపుతిత్తి, ధనుస్సునజేర్పక చేతితో బొడిచెడు బాణము, అంసముమీద మొగలాకు గొడుగు, సొరకాయ దండ యనెడి ఒక విధమగు వీణ, చిరుతాళము, తులసిపేరుల మాలలను గ్రహించి, నొసట శ్రీ చూర్ణముతో పట్టెవర్ధనములను తీర్చి దిద్దెడివాడు.

సామాన్యముగా విజయనగరవాసులు చల్లడమును ధరించెడివారు. ఈ చల్లడమునే చండాతకమనియు వ్యవహరించెడివారు. ఈ చల్లడమును మహమ్మదీయులెక్కువగా ధరించెడివారు. ఇట్టి ఈ చల్లడముయొక్క ప్రభావము విజయనగర వాసులపై గూడ పడినట్లు 'అముక్తమాల్యద' వలన తెలియుచున్నది.

తెనాలి రామకృష్ణుని కాలమున విటుడు చందనములలదుకొని పుష్పమాలలను ధరించి, కర్పూర తాంబూలములను సేవించి కడిగిన ముత్యమువలె నుండెడివాడు. పాండురంగ మహాత్మ్యమున నిగమశర్మను వర్ణించుచు—

తలగడు గంగమర్దనము, దౌతపటావరణంబు, సంస్కృతో
జ్జ్వల కలయాన్నభోజనము, చందనచర్చ, ప్రసూన దామకం
బులు గపురంపు వీడ్యమును భూషణపంక్తులు గల్గి నిచ్చలుం
బులు గడుగంగ బడ్డనును ముత్యము బోలుచు వాలుచుంబురిన్.

(పాండు – ఆ 3 ప9)

రెడ్డితలకు పసుపుచుంగుల పాగను చుట్టెను మాధవశీ వస్త్రమును ధరించి, మెడమీద యుత్తరీయమును వేసుకొనెను. దళసరిగా చందనమును శరీరమునకు పూసికొనెను. వజ్రకుటుంగరమును దొల్లుబోగులను ధరించెను. పిల్లిగడ్డము, మీసలు కలవు. ఈ వర్ణనము క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన పరమయోగి విలాసములోనిది. కావున నీవేషధారణ మాకాలమునాటిదే శుకసప్తతికారునినాటికి వేషములో పెద్ద మార్పులేమియు కానరావు. ఈనాటి రెడ్డి తలకు సగము పాగ చుట్టెడివాడు. 'అయగారి కరల' వస్త్రములను కట్టెడివాడు. పైన నల్లని అంచుల వస్త్రమును ధరించి, తోలు చెప్పు అను పాదములకు తొడిగెడువాడు. పొడవుగా నామమును దీర్చెడివాడు. గడము, మీసలు నుండెడివి.

నాటి కాపు చేతిలో పగ్గముల చుట్టయు, మునికోల, గొంగడి, అంబటికుండ యుండెడివి. కోడేరును ఎడ్లపైన నుంచెడివాడని 'పరమయోగి విలాసము'న వర్ణింపబడినది.

అప్పుడామడ్డి నాయూరి కాపుముప్పిరిగొను పగ్గముల చుట్టతోడ
గ్రుచ్చిన మునికోలగొంగడి ముసుగుయచ్చల మచ్చల
మటెకాశియున్
బలుపైన కేలయంబటి కుండతనకు నలవడనడగొండలన
నొప్పుచున్న
మీపైనయెద్దుల మెడకాడిమీద కోడేరువైచి నెక్కొని
రొప్పికొనుచు"

తెల్లని పంచె పింజెలు పోసి కట్టెడివాడు. చినిగినచొక్కా చెవికి పోగులు, చెవులమధ్య వ్రాతపరికరముతో నాటికరణముండెడివాడు.

వసమించు తెలివలి పంపుపింజియలు పొసగ బుట్టినయట
బోడకుల్లాలు
చింపికుప్పసములు చెవిదోరములును సంపుటంబులతోడ
జంపాడునొడలు
బిగువుచెంపదోపిన బలపములు తగనలవడనత్తరికరణికులు
చనుదెంచిరి.... .... .... .... .... .... .... .... .... ....

శకస ప్తతికారుడు, కరణము నీర్కావి ధోవతిని, ముదుక తలపాగను ధరించి, చంకలందు కాగితములకట్ట, ఘంటముతో నుండెనని చెప్పెను. 'హంసవింశతి' కారుని కాలమునాటికీతని వేషమున కొంత మార్పువచ్చినది. తెల్లని తలపాగ, చొక్కా ఉతికిన కావితంగుపంచె, ఉత్తరీయమును ధరించి, పొగాకుచుట్టను ఒయ్యారముగా కాల్చుచు నుండెడివాడు.

ఊర్ధ్వపుండ్రములనుంచి పంచలోహములచే చేయబడిన యుంగరమును ధరించి, పంచెకట్టి 'వాహాటమనెడి వైద్యగ్రంథము' ను, ఒకచేతిలో కరకకాయలు నుంచికొని రోగముల గుణదోషములను పరిశీలన చేసికొనుచు నెచ్చటనైన మూలికలు లభించునేమో యని దిక్కులకు చూచునట్టి వైద్యు డుండెడివాడు.

> పంచి పొందుల సంచి జగజంపుపలుపపొంకపై నిఃకర్ణముల
> నొప్పుమాది
> కొనిపిడ జుట్టిన కురుమాపుపాగ అను వంద పంచలోహంపు
> టుంగరము
> ఒరుతరంబైనట్టి యూర్ధ్వపుండ్రంబు కరమొప్పువలకేలి
> కరకకాయలును
> బెరయ పచ్చడముతో పెనుపడసంది పరిపు పట్టు బాహాట
> పుస్తకము
> బినుపడ లో గుణపారంబు చదివికొనుచు మూలికలు దిక్కు
> లు చూచికొనుచు.

వైష్ణవభాగవతుడు పింజెలుపోసి పంచినికట్టి, పొత్తిపాగను ధరించి ఎడమచేతియందు పంచాంగమును, చంకయందు చద్ది అన్నపు మూటనుంచుకొనెడివాడు.

> వదలు పింజెల నిడువాలు ధోవతియుపోలగా జుట్టిన
> పొత్తిపాగయును
> దూల గట్టిన వెడతోపు పచ్చడము అంకెడాకేలి పంచాంగంబు
> ముష్టి
> చంకప్రేరెడు తాళిచలిదిమూటయును... .........

పుట్టగోచిపెట్టి, ఎడమ బొటనవ్రేలికీ యినుపయుంగరమును ధరించి తలను దువ్వి, మోటకత్తిని ధరించి, ఎడమ చేతియందు వెదురుబద్ద నుంచుకొనుట మేదరవానికి సామాన్యము.

> పలయంగ నెడదుంటి మైనోరగాగ మొలత్రాటి జెక్కిన
> మోటుకత్తి యును
> కొనసిగతో గూడి కురులొకయింత గను పట్ట జెరివిన
> గన్నెరాకమ్మ
> గొనలవెల్వడు పుట్టగోచియు నెరులుబెనగొన్ననును దబ్బ
> పెనుడాలేల

ఇండ్లు కట్టువారిని కాసెవారు అందురు. వీరు పెద్ద పెద్ద యజ్ఞోపవీతములను ధరించెడివారు. వంకరలు తిరుగుతున్నట్లుగా తల పాగలు చుట్టెడివారు. చంకలయందు వాస్తు శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములనుంచు కొనెడివారు.

> కలయ నాచార్యులు కాసేల నప్పుడు పిలిపింప వారలు పెను
> జన్నిదములు
> చంకల శిల్ప శాస్త్ర పుస్తకముల వంకవో జుట్టిన వలుద
> పాగలును
> కొలది లేఖలు వడికాసిన యట్టి యెలమించి వలకేలి యిను
>ప కమ్మలును
>
> చేరుపనిలిచిరి....... ..........................

వేశ్యవాని నల్లపూసల పేరు, బండి గురిగింజ తావళము, పగడములతో చేయబడిన చేకట్లు, కడియములు, తెల్ల తగరపు ముక్కెర, సీసపు ముదు టుంగరము, కంచు మట్టియలు, సంకు టుంగరము, లక్కా తాయెత్తులు, నల్లముదుక గాజులు, పూలదండిలు నలిగిన చీరలు ధరించెడిది.

> నల్లపూసల పేరు నలగిన కోక
> వెల్లనైగుడి గొన్న విచ్చుటాకులును
> గొప్పునకందని కురుచ వెంట్రుకలు
> కప్పారు రావొడి కప్పు బల్వరుస
> కొమరు మించిన బండి గురిగింజ తావ
> డములు నిట్టుక పవడంపు జేకట్లు
> నితడి కడియముల పికిలి పూదండ
> మొత్తంబులగు నల్లముదుక గాజులను
> లక్కా తాయెతులు తెల్లని తగరంపు
> ముక్కర సీసపు ముద్దుటుంగరము
> కాకి బేగడ బొట్టు కంచు మట్టియలు
> కైకడ సంకుటుంగరమునుంగలిగి ; (పరమ—పుట 323)

తిరుచూర్ణ రేఖలు, పట్టె నామములును తీర్చి, భుజములందు శంఖ చక్రములను గలిగి, చంకలయందు తాళపత్ర గ్రంథములలో సాత్తని వారుండెడివారు. సాత్తని, సాత్తిన అని వైష్ణ వార్చకులలో రెండు శాఖలు కలవు. సాత్తని వారు నెత్తిని గుండుగా గొరగుక జందెము వేసి కొన్నవారు, సాత్తిన వారు నెత్తి బోడిగా గొరిగించక జందెము లేక వుండువారు.

గంధపుబొట్టు, కచ్చల తలపాగ, కావి దుప్పటిని, పూసలను, చెవులకు పోగులను, వెండి మొలత్రాడును, నీలపు టుంగరమును, కిర్రు చెప్పులను విలాస పురుషుడగు కోమటి ధరించెడివాడు. వీడియమును ధరించుటాతని విలాసత్వమునకు నిదర్శనము.

అమ్మల పొదికి నెమలి పురి చుట్టి, సెలవిల్లును ధరించి, మొలకు పులి తోలును చుట్టి, నడుమదట్టిలో కుఱుచపిడెము నుంచి పికిలి పూవులదండను ధరించి, కుడిచేతి సందెపై గురిగింజల దండ చుట్టి, తలముళ్ళను ఎఱుకల సాకెగాండ్రు ధరించెడివారు.

> చిలుకంప పొదికి దార్చిన నెమ్మపురిజిల్లి చేనిక్కిడినచేగ
> సెలుసువిల్లు
> గట్టిగా దట్టిగా గట్టిన పులితోలు గుడివంక దోపిన కుఱుచ
> పిడెము

బేరెద జేర్చిన పిక్కిలి పూవుల చేరు గుడి నంది గురిగింజ
కుట్టు దండ
జుంజురు సిక మీద జుట్టిన తలముళ్లు దట్టిలోపల నణపెట్టు
చుట్ట
కోర మీసలు, మిర్రి గ్రుడ్లు గునుకు నడుపు దెదరు జూపులు
గలిపేన గదురు కరిపు
వలుదయోరచ్చులును గల్గి వచ్చెనెలకు పాళెగాడొక్క
చంద్రభాను కడకు.

(చంద్రభాను చరిత్రము—ఆ2—పలి)

ముక్కు యొక్క పై భాగము నుండి నాభిదాకా చేయబడిన నామమును సన్నగ దీర్చినట్లుంచి, చెవుల పైకి అను నంతటి తెల్ల చెంగుల పాగను కట్టి, నీలికాసెపై, హనుమంతు కాసెను ధరించెడివాడు.

తలవరి దగ్గరనున్న ఇనుప దండము శబ్దమును కలిగింపగా విచ్చు కత్తులు తళతళ కాంతులీన, హనుమదాకృతులచే నిండిన కంచు కేడెముల శబ్దములచే దాలుమించునట్లదరు క్రోవుల శబ్దమునకు కాకులదరి పోయెడివి. ఇది ఆనాటి తలవరి ఆకారము.

కావి వస్త్రమును ధరించి, క్రొమ్ముడి కన్పింపకుండంగ ఖండశాటి కట్టి, జమిలి పూసల కంఠసరి ధరించి, హరిహరీ యనుచు విష్ణు భక్తి మూర్తీభవించినదా యనునట్లు దాసరిసాని యుండెడిది.

'మెరుగులు పైకి గ్రేళ్ల బికెడు గబ్బిగుబ్బల మీద గావి
కుప్పసము దొడిగి
యడచి క్రొమ్ముడి బయల్పడకుండగా ఖండశాటి యొదలను
మించగ బిగించ
బెళుకు జూపుల గెలంకుల దాటగా నీక నిజపద నఖరేఖ
నెలవు కొలిపి
హరి నీలముల యొప్పునడకించు కెందమ్మి జమిలి కొలిపి
పూసల కంఠసరి యమర్చి
యల్ల నల్లన హరిహరి యటంచు, గోలయును బోలె
నొదుగుచు గొదగికొనుచు
విష్ణు పద భక్తి మూర్తీ భవించెననగ జకిత హరిణాక్షి
దాసరి సానియయ్యె!

ముస్లిం జవాను వేషము విచిత్రముగా నుండెడిది. మెలి పెట్టి చుట్టిన తెలిపరంగి ముదాసు, బంగారు జరీ పని కలిగిన పట్టు హిజారు, శరీరము కనుపించునట్టి అంగీ, శాలువ వలె వాటువదలు పాపోసులు ధరించి, డాబాకత్తి నుంచుకొనెడివాడు. పాపోసు అనగా మీగాలు వరకు గప్పెడి పాదరక్ష.

మెలిపెట్టి చుట్టిన తెలి పరంగి ముడాసుపై లపేటా డబ్బి
పసుల జెలంగు
బంగారు వ్రాతల పట్టు హిజారు కంబరు చీనిని మతాని పాడు
నొసలు
తనుకాంతి, గనుపింప దనరు నంగీ జోడు వలిపెంపుశాలువ
వల్లెవాటు
పడుదలలోన డాబాకత్తి వదలు పాపోసులు గోరంట
బొలుచు గోళ్లు
నడుమ సీలున్న తోలు డాల్ బెడగు సూప, అభయముగ
వెంట నరుదెంచు నభరువాడు

జారుగా ముడిచిన వెంట్రుకల దూముడి, నొసట పసుపు బొట్టు, చీరను గోచి పోసి కట్టుట, లక్కాకులను ధరించుట నాటి బ్రాహ్మణ స్త్రీ వేషము. లక్కాకులనగా నాడు వారు చుట్టిన కమ్మ చెవినుంచుకొనెదు, లక్క పూసిన తాటాకు అని పద్ది రత్నాకరము.

కేలుగంటిది యేల పొలగా నునుగొప్పు
గిల్కొల్పు కొమ్మంచు గిజపోవు
పసుపు బొట్టిది యేల నొసట విభూతి రే
ఖ యమర్చి కొమ్మంచు కంటగించు
కాసె కట్టిడియేల కవురుగమై జారు
చీర దాల్చుమటంచు చిమ్మరేగు
లక్కాకు లివియేల చొక్కంపు టంచుక
మ్మలు ధరించు మటంచు నలుకగాంచు.

రెడ్డి స్త్రీ మెయిజారు చీరను, బిగువైన రవికను ధరించెడిది. గొంటు పూసలు, రెండు గుండ్ల ముంగరలు, సన్న గొలుసు పెద్ద మట్టెలు, మట్టి పిల్లాండ్లు, బొబ్బిలి కాయలు, ఒత్తులతోడ కూడిన కడియములను ధరించెడిది, వ్రేళ్ళకు ఉంగరములు, చెవులకు కమ్మలను నానుపజెడను ధరించెడిది. సన్నని కాటుక రేఖను తీర్చి నొసట నాభి నామము నుంచెడిది.

గొంటు పూసలు రెండు గుండ్ల ముంగరలు, మైజారు
చీరలుపెన సన్న గొలుసు
పెద్ద మట్టెలు, మట్టి పిల్లాండ్లు, బొబ్బిలి కాయ లొత్తుల
తోడి కడియములును
కప్పు పల్వరుసలుంగరములు తూలెడు కొంగులు బలు చెంప
కొప్పులంచు
కన్నుగవల్ సన్నకాటుక రేఖలు నాభి నామంబులు నాను చుట్లు
పసుపు పూతలు.......... బిగువు రవికలు...............

కట్టెలు కొట్టువారు పుట్ట గోచినుంచి, పాదరక్షలను తొడిగి, సుంకపు కాసులను గొడలిని గ్రహించి, చలిది యన్నపు మూటను తీసకొని వెళ్ళెడివారు, ఇది కట్టెలు కొట్టెడివాని వేషము.

వేశ్యలకు కాపు వేశ్యమాత. ఈ వేషము చూసిన ప్రతి యొక్కరికి నవ్వు పుట్టించును, వృద్ధాప్యముచే రాలిపోయి కుఱుచ లైన కేశములను కొప్పుగ ముడివేయును. పాత చెప్పు అట్టవలె జారిన స్తనములను రవికచే గట్టిగ బిగించి కట్టును. ముడుతలు పడిన శరీరముపై దట్టముగా పసుపును రాచి, నొసటియందు బొట్టు, కండ్లయందు కాటుకను పెట్టి, మాసిన వస్త్రమును కట్టెడిది. పండ్లూడిన బోసి నోటిలో తాంబూలమును వేసెడిది.

కుఱుచలై తఱుచుగా నెఱసిన వెండ్రుక
లొప్పు మీఱగ దువ్వి కొప్పు ముడిచి
యిలఁద్రాల చెప్పులట్టులఁబోలి వ్రేలాడు
కుచముల అవికచే గుదియఁబట్టి
తొఁగిన కుబుసంబువడువున ముడుత లే
ర్పడి యెడనొదలపైఁబసపు రాచి
యెలుగు తోలును మీరి యెంతయు మాసిన
పెద్ద పుట్టము చాల బ్రీతిఁగట్టి

బొరుసు నొసటను జంద్రంపు బొట్టుపెట్టి
యడుసు కన్నులు గజలంబడర దిద్ది
బోసెనోటను దములంబుపూని యిటుల
విటుల బలు మాఱునగఁజేయు వృద్ధ వేశ్య.'

(రాజశేఖర విలాసము—ఆ 3—వ 71)

సరిపణతోడి సజ్జ, తాయెత్తులు, ఉంగరములు, చెవుల కమ్మలు, తలపాగ. తెల్లని వస్త్రమును సెట్టిబలిజ ధరించెడివాడు. వక్షః స్థలమున రుద్రాక్షమాలను, విభూతి రేఖలను ధరించెడివాడు.

పొప్పళి వస్త్రమును గట్టి, మెలిగొన తలపాగఁ జుట్టి, ఆ చెరగుపై పట్టుశాలువను, లపేటా వలెనుంచి, నీలాల బోగులను ధరించి భుజముపైన సిమిపంచి నుంచి, నొసట నాభి నామమును దీర్చి, దుబుడుక్కల వాడుండెడి వాడు.

రంగుల లంగా, వల్లువకుచ్చెళ్ళతో చీరను గట్టి, ముసుగువేసి కొని బొందిలీ స్త్రీ యుండెడిదని యొక చాటువువలనఁ దెలియు చున్నది.

పన్నెలగాగరా, చెలఁగు వల్లువ కుచ్చిళ్లలందు పాదముల్
సన్నపు వారి భంగముల సంబున నీగెడు బాల కూర్మముల్
గన్నతెరంగు దోప కరకంజములన్ ముసుకుం బిగించి ప్ర
చ్ఛన్నము భాజ్యయైనడచెచంగున బొందిలి భామగోమునన్.

ఈ చాటువు శ్రీనాథ కృతమని పలువురి యభిప్రాయము. కావున నీ బొందిలి భామ వేషము శ్రీనాథుని కాలమునకు జెందినదని భావింపవచ్చును.

# పోలవరం ప్రాజెక్టు

(15 వ పేజీ నుండి)

ఈ కోటి ఎకరములలో అథమ పక్షము ఎకరాకు సగటున ఒక మెట్రిక్ టన్ను ఆహార ధాన్యాలు దిగుబడి రావచ్చు. అట్లయినచో ఒకకోటి టన్నుల ఆహార ధాన్యాలపంట లభించగలదు. దేశం సుభిక్షమవుతుంది. అన్నం సమస్య తీరుటయేకాక, దేశ ఆర్థిక పరిస్థితి కుదుటపడుతుంది.

గోదావరి మహారాష్ట్రములో నాసిక త్రయంబకము వద్ద పుట్టినప్పటికినీ, విశేషమేమిటనగా, ఈ నది నీటిని ఎక్కువ భాగము ఆంధ్రప్రదేశములోనే ఉపయోగించుకొనుటకు ఎక్కువ అవకాశములు కలవు. ఈ నదియొక్క ముఖ్య ఉపనదులగు మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి గోదావరి నదిలో ఆంధ్రప్రదేశములోగాని ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సరిహద్దు లో గాని కలియుచున్నవి. ఈ నాలుగు ఉపనదులు గోదావరికి 75 శాతము నీటిని తీసుకొనివచ్చుచున్నవి. అందుచే ఈ నదికి పశ్చిమ కనుమలగుండా వచ్చునీరు చాలా తక్కువ.

దేశ ఆర్థిక ప్రగతియే ధ్యేయంగా ఉన్నచో గోదావరిపై ఇచ్చంపల్లి, పోలవరం ప్రాజెక్టుల నిర్మాణం అత్యావశ్యకం.

సుమారు 500–600 కోట్ల రూపాయలతో గోదావరిపై క్రొత్త ప్రాజక్టులైన ఇచ్చంపల్లి, పోలవరం ప్రాజక్టులను నిర్మించవచ్చును. తగిన నిధులు సకాలంలో సమకూర్చినచో 10 సంవత్సరాల కాలంలో ఈ ప్రాజక్టులను నిర్మించుకొనవచ్చును. ఇది ఏమంత కష్టసాధ్యమైన విషయం కాదు.

ఈ బృహత్తర కార్యక్రమం కోసం ప్రపంచబ్యాంకు నుండి తక్కువ వడ్డీపై దీర్ఘకాల ఋణాలను పొందడానికి అవకాశాలు కలవు. భారతదేశానికి ఎక్కువ సహాయం అందివ్వటానికి సంసిద్ధతను వ్యక్తపరిచారు ప్రపంచబ్యాంకు ప్రెసిడెంట్ శ్రీరాబర్ట్ మెక్‌నామారా. అమెరికా కూడా అంతర్జాతీయ అభివృద్ధి కార్యక్రమం క్రింద సహాయమొనరించవచ్చును. చమురు ఉత్పత్తి చేసే అరబ్ దేశాల నుండి కూడా ఆర్థిక సహాయం లభిస్తుంది.

కోటి టన్నుల ఆహారధాన్యాలను పండించగల గోదావరి జలాలను వృధాకానీయరాదు. కోటి టన్నుల ఆహారధాన్యాల విలువ సుమారు 1,000 కోట్ల రూపాయలు ఇంత ఉత్పత్తి కాగితం మీద కాదు. ఆదిలాబాద్, మెదక్ నిజామాబాద్, కరీంనగర్, హైదరాబాద్, వరంగల్, ఖమ్మం, నల్గొండ, కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలోని పొలాలలో కనిపించాలి. అప్పుడే మనం భావి తరాలవారికి మార్గ దర్శకులం కాగలం. క్రీ.శ. 2000 సంవత్సరానికి భారతదేశ జనాభా 90కోట్లకు పై బడవచ్చు. ఆ జనాభా అవసరాలనుకూడా ఇప్పటినుంచి దృష్టిలో పెట్టుకోవాలి.






కృష్ణమాచారి ఎందుకో గుడి దగ్గరే వున్నాడు! రత్తి నీళ్ల తోడుతూవుంటే, అలే చూస్తూ వుండిపోయాడు! మండుటెండలో నల్లని రత్తి దేహం నేరేడుపండులా నిగనిగలాడుతూ వున్నది.

నీళ్ల తోడేటప్పుడు అవయవాలలో కలిగే మార్పులు పరీక్షగా చూడసాగాడు కృష్ణమాచారి!

కాసేపటికి రత్తి తలఎత్తి చూసింది, ఎదురుగా కృష్ణమాచారి కనిపించాడు !

' ఏంది, అయ్యగారు ! విసిత్రం సూసినట్టు సూస్తున్నారు!' అంది.

' విచిత్రంగానే వుందే, రత్తీ ! నిన్ను సూస్తుంటే మా గుడిలోని బొమ్మల్ని నిన్ను చూసే మలచాడే మా శిల్పి అనిపిస్తున్నది ! అచ్చు నీలాగే వున్నది ఒక బొమ్మ అయితే ! '

కృష్ణమాచారి రత్తికళ్ళలోకి చూస్తూ అన్నాడు !

' నాలాగ ఎందుకుంటుంది అయ్యా ! రాములవారి గుల్లో నా అసుమంటి బొమ్మలు ఎందుకుంటాయి ? '

కృష్ణమాచారిని విచిత్రంగా చూస్తూ అన్నది రత్తి.

' అదే నాకూ తెలియకుండా వుందే ! నీ బొమ్మ గుల్లోకి ఎలా వచ్చిందా ? అని ! "

గుడికి అనుకొని పూలతోటవున్నది ! తెల్లగన్నేరు, సంపంగి, మందార, ఇంకా రకరకాల పూల మొక్కలు వున్నాయి.

రత్తి ఆ పూల ముక్కలవైపు చూస్తూ ' ఆ పూలన్నీ దేవుడికి పెడతారా ? ' అని అడిగింది.

' ఏం, నీకు కావాలా ? కోసి ఇవ్వనా ?' విలిపిగా చూశాడు కృష్ణమాచారి !

' అమ్మో ? దేవుడి పూలుగదా' సందేహించింది రత్తి.

' దేవుడికి పెడితే అందమా ! చందమా ! నీలాంటి కన్నె పిల్ల పెట్టుకుంటేనే పూలకి సార్థకత!' అంటూ కృష్ణమాచారి రెండు మందార పూలుకోసి రత్తి చేతికి అందించాడు !

చేతికి ఇచ్చేటప్పుడు కావాలని రత్తి చేతులను స్పృశించాడు !

రత్తి స్పర్శ కృష్ణమాచారిలో ఏదో చెప్పలేని వింత అనుభూతిని కల్గించింది !

రత్తికి కూడా అదోలా అనిపించింది !

' ఇంకనేను పోతానయ్యా ! చాలా ఆలస్యమైంది ' ! అంటూ కడవ నెత్తిన పెట్టుకున్నది !

'రేపుకూడా ఇలానే ఒంటరిగా రా ! పూలుకోసి ఇస్తాను !' అన్నాడు కృష్ణమాచారి, కడవ ఎత్తుకొనేప్పుడు రత్తిలోని వొంపు సొంపుల్ని కళ్ళతో తాగుతూ !

రత్తి ప్రతీరోజు వంటరిగా నీళ్ళకు రావటం మొదలుపెట్టింది. కృష్ణమాచారి మధ్యాహ్నం గుడి పరిసరాలు దాటి బయటికి పోవటం లేదు !

ఒకరోజున కృష్ణమాచారి రత్తిని గుళ్ళో బొమ్మలు చూద్దువు గాని ! రమ్మన్నాడు !

'అమ్మ బాబోయ్ ! గుళ్ళోకే' ! అంది రత్తి

' గుళ్లోనీలాంటిబొమ్మలేవున్నాయి! చూ దువుగాని, రా !'

'మేం, రాగూడదుగా గుళ్లోకి !'

'ఎవరుచెప్పారు రాగూడదని? తిరుపతిలో అయితే అందరూ పోతారుట !' తన లోకజ్ఞానాన్ని చెప్పాడు కృష్ణమాచారి !

'అయినా ఇది తిరుపతి గాదుగా !'

'తిరుపతి కాకపోతేనేమి ? ఇందులోకిగూడా వెనకటికి మీ ప్రకాశం తండ్రి రామదాసు వచ్చాడట !'

'ఏమోనయ్యా ! నీతో మాటలు చెప్పటం నాకు చాతకాదు! అన్నింటికి ఏదో వొకటి సెప్పుతావు!' లన్నది రత్తి కృష్ణమాచారి కళ్లలోకి చూసి నవ్వుతూ!

కృష్ణమాచారి రత్తిని చేయిపట్టుకొని గుళ్లోకి తీసికొని వెళ్లాడు !

లోపల వున్న నల్లరాతి బొమ్మలను చూపించాడు ! ఒక బొమ్మ దగ్గర నిలబడి 'ఇదిగో ఈ బొమ్మచూడు ! అచ్చు నీ లాగే వున్నది !' అన్నాడు.

రత్తి ఆ బొమ్మవైపు చూసి సిగ్గుపడింది ! అదొక స్త్రీ మూర్తి విగ్రహం ! నల్లనిరాతి మీద మలచబడి వున్నది ! స్తనాలు ఉబ్బుగా మలచపడ్డాయి !

'ఆ బొమ్మకంటె ఈ బొమ్మే అందంగా మలిచాడు బ్రహ్మదేవుడు !' అంటూ రత్తి భుజం మీద తట్టాడు కృష్ణమాచారి !

రత్తికి సిగ్గు ముంచుకొచ్చింది.

'గుల్లో అన్నీ ఇసుమంటి బొమ్మలేనా వుండేది ? రాముల వారి బొమ్మ ఏది ?' అడిగింది రత్తి గుడిని వింతగా పరిశీలిస్తూ.

'అటుపద !' అంటూ రత్తిని గర్భగుడిలోకి నడిపించుకొని వెళ్లాడు కృష్ణమాచారి !

పట్టపగలైనా చీకటిగా వున్నది గుడి లోపల. గూట్లో వున్న అగ్గిపెట్టె తీసి దీపం వెలిగించాడు కృష్ణమాచారి. ఆ దీప కాంతిలో సీతారామలక్ష్మణుల విగ్రహాలు మిలమిలా మెరిసి పోతున్నాయి.

రత్తి కళ్లు తళతళ లాడుతున్నాయి !

'ఇదిగో ఇది రాములవారి విగ్రహం ! ఇది సీతమ్మ వారిది ! ఇదిగో ఇది లక్ష్మణ స్వామిది !' విడివిడిగా వేలు పెట్టి చూపాడు కృష్ణమాచారి.

## —24—

హరిజనవాడ తగలబడి పోయిందని తెలిసి చౌదరి కుటుంబానికి రెండేసి మానికల చొప్పున జొన్నలు కొలిపించారు.

రమేశ్ ప్రభుత్వం నుంచి తగిన సహాయం ఇప్పిస్తానని వాగ్దానం చేశాడు.

ఈ లోగా కొందరు తాటాకులు, సజ్జ చొప్ప, వెదురుగడలు— ఎవరికి తోచిన సహాయం వాళ్లు అందించారు.

చౌదరి ఔదార్యాన్ని హరిజనులంతా కీర్తించారు !

కాని బావి పని మాత్రం ఆగిపోయింది. సిమెంటు, సున్నం కొనటానికి డబ్బు లేదు. ఇంకా రాయి కొట్టించాల్సిన పని గూడ వుండి పోయింది.

ప్రకాశం తన పొలంలో పంటతోనైనా సరే బావి పని పూర్తి చేయించాలని అనుకున్నాడు.

కాని తన పంట అంతా కాలిపోయింది ! మందాటి వేరు శనగ వేసినా ఫలసాయం వచ్చే సరికి నాలుగు నెలలయినా పడుతుంది !

ఈ లోగా అప్పు దొరుకుతుందేమోనని ప్రయత్నం చేశాడు ప్రకాశం. కాని రైతులు ఎవరూ అప్పు ఇవ్వ లేదు. రెండు రూపాయల వడ్డీకి గూడ దొరక లేదు. ప్రకాశం నిరాశ చెందాడు.

ఈ లోగా వెంకులు పోలీసులకు రిపోర్టు ఇచ్చాడు. ప్రకాశం బావి కోసం చందాలు వసూలు చేసిన సొమ్ముకాజేశాడని !

వెంకులు రిపోర్టిచ్చాడనేసరికి ప్రకాశానికి ఆశ్చర్యం వేసింది. వెంకులు వెనక ఎవరున్నదీ తెలుసుకోవటం కష్టమయిన పనికాదు ! చౌదరి బలం లేనిదీ వెంకులు ఆ పని చేయడు !

ఆ రోజు రాత్రి వెంకులు తన యింటి వెనుకకు పోవటం చూచాడు తను . ఆ తరువాత అరగంటకే ఇల్లు తగలబడింది ! ఇది కాకతాళీయమా ! లేక ఏదైనా కుట్రలో భాగమా ! ప్రకాశం మనసు పరి పరి విధాల పోయింది.

పోలీసులు వచ్చి ప్రకాశాన్ని అరెస్టుచేసి తీసుకొని వెళ్లారు.

ప్రకాశం చందాలు వసూలు చేసినట్టు ఒప్పు కున్నాడు. కాని కాలిపోయిన సంగతి కూడా చెప్పాడు.

ప్రకాశాన్ని అరెస్టుచేసి తీసికొని వెళ్ళేటప్పుడు లక్ష్మి ప్రతిఘటించింది.

'కావాలంటే తరువాత బెయిలు మీద విడిపించు కోండి' సలహా ఇచ్చాడు అరెస్టు చేసిన ఇనస్పెక్టరు.

'పెద్ద వాడికి కబురు పెట్టండి ! వాడు విడిచి పెట్టిస్తాడు నా తండ్రిని !' అంటూ పోరు పెట్టింది వెంకాయమ్మ !

రామదాసు ససేమిరా, వినలేదు !

'వాడు నన్ను తండ్రి కాదని అనుకొంటున్నప్పుడు, నేను మాత్రం వాణ్ని కొడుకు అని ఎందుకు అనుకోవాలి ? నా రెక్కలో సత్తువ వున్నంతవరకు కూలి చేసి అయినా బావి సొమ్ము తీరుస్తాను ! ఆ రాముడి ఇష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది' అన్నాడు దాసు.

లక్ష్మికి ఏం చేయటానికీ తోచ లేదు . తను ఏ కొమ్మ మీద ఆశలు పెట్టుకొని నివాసం ఏర్పరచుకొన్నదో, ఆ కొమ్మను

ఎవరో కావాలని నటికి వేస్తున్నట్టుగా భావించింది! ఆ కొమ్మను పరిగణించాలిసిన బాధ్యత తన మీద వున్నది.

తన పొంటి మీద సొమ్ము కూడా లేదు. అవి అమ్మి అయినా ప్రకాశాన్ని విడిపిద్దామంటే! సొమ్ముల మీద తనకు మొదటి నుంచీ మోజు లేదు. సొమ్ములుంటే ఎంత బావుండేది అనుకొన్నది లక్ష్మి జీవితంలో మొదటి సారిగా!

నాలుగు రోజుల క్రిందటిదాక వున్నంతలో సుఖంగా బ్రతికిన సంసారం బజారున పడింది!

వెంకాయమ్మ, రామదాసు కూలికి పోతున్నారు! తన పని మరీ అధ్వాన్నంగా వుంది. కూలి పని చేయలేదు! కూర్చొని తినలేదు! రెండూ బాధగానే వున్నాయి. చివరకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది లక్ష్మికి. తనపేరుమీద మూడెకరాల పొల మున్నది. అది తల్లి నుంచి తనకు సంక్రమించింది. అది అమ్మితే ఈ ఇబ్బందులు తీరుతాయి.

కాని దాసుకు తెలిస్తే ఒప్పుకోడు.

అందుచేత దాసుకి తెలియకుండా రమేశ్‌కి కబురు పంపింది. రమేశ్ వచ్చాడు.

'అన్నయ్యా! నా పేరు మీద వున్న పొలం అమ్ముతాను, ఎవరైన కొంటారేమో కనుక్కో!' అన్నది లక్ష్మి. రమేశ్ లక్ష్మికి అన్న వరుస అవుతాడు!

'ఏ పొలం? తూర్పు పొలంలోని మూడెకరాల చెక్కేనా?'

'అవును! అదే, అది నా పేరున వున్నది. అందులో ఒక ఎకరం అమ్ముతాను!'

రమేశ్ ఆలోచించాడు! ఆ పొలం తన పొలానికి అనుకొనే వున్నది. ఇది వరకు ఒకసారి చౌదరిని ఆ చెక్క యివ్వమంటే ఇవ్వనన్నాడు. ఇప్పుడు మంచి అవకాశం వచ్చింది!

'ఎవరు కొంటారబ్బా రైతుల దగ్గర డబ్బు లేని రోజులే!' సాలోచనగా అన్నాడు రమేశ్!

'ఏలాగో ఒకలాగు బేరం కుదిర్చి ఈ సహాయం చేసి పెట్టు!' బ్రతిమాలే ధోరణిలో అన్నది లక్ష్మి.

'సరే! ప్రయత్నం చేస్తాను! ఏ సంగతీ రేపు వచ్చి చెప్పుతాను' అంటూ లేచాడు రమేశ్!

* * *

రమేశ్‌కు మూడెకరాలు కలుపుకొంటే బావుండు ననిపించింది. లక్ష్మి ఒక్క ఎకరం మాత్రమే అమ్ముతానంటున్నది. అయినా లక్ష్మికి డబ్బు అవసరం. అడిగి చూదాం! ఊళ్లో నలుగురు రైతులకీ తెలిస్తే ఎగబడతారు! రహస్యంగా బేరం సెటిలు చేసికొంటేనే మంచిది, అనుకున్నాడు రమేశ్!

మర్నాడు వచ్చి 'అమ్మాయి లక్ష్మి! వ్యవహారం దగ్గర మొహమాటం పనికి రాదంటారు! వ్యవహారం వ్యవహారమే! బంధుత్వం బంధుత్వమే! ఏమంటావు?' అన్నాడు రమేశ్ ఉపోద్ఘాతంగా!

'ఇంతకీ విషయమేమిటో చెప్పు. బేరం కుదిరిందా?' అడిగింది లక్ష్మి.

'ఆ సంగతే చెప్తున్నాను! రైతుల దగ్గర ఎవరి వద్దా పైస లేదు! పోనీ నేను కొందామను కొంటే ఒక్క ఎకరం నాకు ఎటూ కలవదు! మొత్తం మూడు ఎకరాలూ అమ్మేట్టయితే చూడు! అది నాకూ కలుస్తుంది. నీకు సొమ్మూ ఉపయోగపడుతుంది! అదీ నాదగ్గర ప్రస్తుతానికి డబ్బులేదు! ఎవరిదగ్గరైనా అప్పుతేవాలి! కాని ఏంచేస్తాం? అవసరం గదా!' అన్నాడు రమేశ్ నిక్కచ్చిగా.

'ఎవరిది అవసరం? నీదా? నాదా?' అనుకున్నది లక్ష్మి మనసులోనే! దాసువాళ్లకు తెలియకుండా బేరం కుదిరితే చాలు, అనే తొందరలో వున్నది లక్ష్మి!

'సరే నీవు తీసికొంటానంటే నాకు వేరే కావలిసిం ఏముంది? ఎవరో పరాయి వాళ్లకి ఇచ్చే బదులు నీకు ఇవ్వటమే మంచిదిగదా!'

చివరకు మూడు ఎకరాలు పన్నెండు వేలకు అమ్మింది లక్ష్మి.

బావి డబ్బు కడతామని చెప్పి ప్రకాశాన్ని విడిపించుకొని వచ్చాడు రమేశ్.

## —25—

'నీవు చేసినపని నాకేం నచ్చలేదు లక్ష్మి!' అన్నాడు సీరియస్‌గా ప్రకాశం.

'మరి నన్ను ఏం చేయమంటావు ప్రకాశం! అంతకు తప్ప గత్యంతరం లేక పోయింది! పోనీ లే అవసరానికి ఉపయోగపడ్డది!' బదులు చెప్పింది లక్ష్మి.

'నేను జైలునుంచి విడుదల కాక పోయినా పెద్ద నష్టమేమీ జరిగేది కాదు! అనవసరంగా పొలం అమ్మావు!'

'పొలం అమ్మకపోతే బావి సొమ్ము ఎక్కడ నుంచి తేగలం?'

'తల తాకట్టు పెట్టి తెచ్చేవాళ్లం! లేకపోతే కూలిచేసి తీర్చేవాళ్లం!' అన్నాడు ప్రకాశం బాధగా.

'నిదానంగా ఆలోచించు ప్రకాశం! నీకు అప్పు పుట్టిందా నాలుగు రోజులు తిరిగినా? రెండురూపాయల వడ్డీ ఇస్తానన్నా ఎవరూ ఇవ్వలేదు! అప్పుడు ఎవ్వరి దగ్గరా డబ్బులేదు! రమేశ్ దగ్గరా లేదు. కాని పొలం కొనటానికి అందరి దగ్గరా డబ్బు వున్నది! రమేశ్ దగ్గర కూడ వున్నది!! అంతే స్వార్థంతో కూడినది లోకం!!!'

'అది కాదు లక్ష్మీ ! ఇప్పటికే నేను నీ ఆస్తికోసం నిన్ను చేరదీశానని అందరూ అనుకుంటున్నారు...! మన ఎదుటగా అనక పోయినా వాళ్ల మనస్సులోని భావం అదే! అటువంటప్పుడు నీవు పొలం అమ్మినావంటే, నేను నలుగురిలో తలఎత్తుకొని తిరగలేను!' ప్రకాశం మాటల్లో బాధ ద్యోతక మవుతున్నది !

'నాకు తెలుసు ప్రకాశం నీవు బాధపడతావని !.... కాని పరిస్థితులు అటువంటివి !! పోనీ, ఇప్పుడైనా బావి సొమ్ము అప్పుగా స్వీకరించు ! ఆ పని పూర్తి చేయించు !! తరువాత పంట రాగానే నాకు తీర్చుదువుగాని. సరేనా!' రాజీ మార్గాన్ని సూచించింది లక్ష్మి.

'లక్ష్మీ ! నీవు నిజంగా మానవమాత్రురాలవు కాదు సుమీ! నా కోసం, పేదలకోసం దివినుండి భువికి దిగివచ్చిన కరుణా మూర్తివి. నీకు కృతజ్ఞతలు ఎలా తెల్పుకోవాలో తెలియకుండా వున్నది !' అన్నాడు ఆవేశంతో ప్రకాశం.

'ఓహో ! దొరగారికి కవిత్వం కూడ వచ్చునన్నమాట ! పోనీ నన్ను పెళ్లి చేసికొని నీకృతజ్ఞతలు వెల్లడించుకోవచ్చుగా !' ప్రకాశం కళ్లలోకి చిలిపిగా చూస్తూ అన్నది లక్ష్మి.

'నిజం చెప్పుతున్నాను లక్ష్మీ నిన్ను పొందటానికి నేను ఎంతో తపస్సు చేయాలి ! ఆ తపస్సు పూర్తి అయే రోజు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను !'

'సరే ! ఎదురు చూస్తూ వుండండి ప్రకాశంగారూ ! ఎప్పుడో ఈ దేవి ప్రసన్నమై నీకోరిక తీరుస్తుంది !'

'ఆ దినము నా జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించ దగినదిగా భావిస్తాను !'

'మరీ అంత భావుకుడవైతే లోకంలో బ్రతకటం కష్టం ! సరే ! నేను చెప్పేది విను!'....

'పొలం అమ్మిన బాపతు బావికి పోను ఇంకా పదివేలు వుంటాయి ! ఇవి ఏం చేదామంటావు ? నాకైతే ఏదయినా నలుగురికీ ఉపయోగపడేలా ఖర్చు చేదామని వుంది !'

'ఏం చేదామని వుంది నీకు ?'

'నాకు ఏం చేయటానికీ తోచటం లేదు ! నీవు చెప్పు ఏం చేదామో !'

'నేనేం చెప్పేది! నీవు ఏం చేయదలచుకుంటే అదే చేయి!'

'అదిగో అలా అంటే కుదరదు ! నాకైతే ఒక పఠన మందిరం కట్టిద్దామని వుంది ! పఠన మందిరం అంటే పత్రికలు తెప్పించేది కాదు !'

'నీవు చూస్తూనే వున్నావుగదా! బడికి వెళ్లే పిల్లలకు రాత్రి పూట ఇళ్లవద్ద చదువుకోడానికి వీలు పడటం లేదు ? ఉదాహరణకి మన హరిజనవాడ సంగతే చూడు ! సాయంత్రం దీపాలే వెలిగించరు సగం మంది ! వెలిగించినా రాత్రి వాతావరణం ఎలా వుంటున్నదో అందరికీ తెలిసిందేగదా! తాగి తందనాలాడటం, కొట్టుకోవటం, తిట్టుకోవటం, చదువు కోవటానికి తగిన పరిస్థితే కనిపించదు! అట్టి దశలో పిల్లలు ఇంటి దగ్గర ఏం చదువుకో గలుగుతారు ! స్కూల్లో ఇచ్చిన ఇంటి పని ఎలా పూర్తి చేస్తారు ? తల్లి దండ్రులా చదువులేనివారు! చదువుయొక్క విలువను కూడ తెలిసికోలేని వారు ! వాళ్ల పిల్లల చదువును ఏం పర్యవేక్షిస్తారు !

'అందుచేత రాత్రి పఠన మందిరం నిర్మిస్తే చాల ఉపయోగంగా వుంటుందని నా అభిప్రాయం ! పిల్లలు రాత్రి భోజనాలు చేసి పఠన మందిరానికి వస్తారు! చదువుకొని అక్కడే పడుకొంటారు! తెల్లవారి కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం కూడ చేసి ఇంటికి వెళ్లతారు ! ఏమంటావు ?' అన్నది లక్ష్మి.

'నీ ఆలోచన అద్భుతంగా వున్నది ! నిజానికి హరిజనులకే కాదు. చాల మంది పిల్లలకు ఇంటిదగ్గర చదువుకోటానికి తగ్గ వాతావరణం వుండదు !'

'అయితే మన పఠన మందిరంలో అందరి పిల్లలనూ చేర్చుకుందాం ! అలా అందరి పిల్లలను చేర్చుకుంటే పిల్లల లేత మనస్సులలో మనమంతా ఒకటే అనే సంఘీభావం కూడ ఏర్పడుతుంది.'

'చాల బాగున్నది! ఒకళ్లు గొప్పవాళ్లనీ, ఒకళ్లు తక్కువ వారనే భావం పిల్లలలో కలుగ కూడదు. శుభస్య శీఘ్రం ! పని ప్రారంభించుదాం !' అన్నాడు ప్రకాశం.

శ్రీకాకుళం జిల్లా

# గిరిజనాభివృద్ధికి కార్పొరేషన్ సేవ

—శ్రీ యం. బాపూజీ
శ్రీ జె. వి. కె. వి. పండిట్

మన రాష్ట్రంలో మొత్తం ముప్పైమూడు తెగలకు చెందిన గిరిజనులున్నారు. ఇందులో మూడు, నాలుగు తెగలకు చెందిన వారు శ్రీకాకుళం జిల్లాలో వున్నారు. ఈ జిల్లాలోని గిరిజనుల సంఖ్య దాదాపు 3 లక్షలు. వీరు నివసించే ప్రాంతంలో చాలాభాగాన్ని ఏజెన్సీ ఏరియాగా ప్రకటించారు. ఈ ప్రాంతమంతా ఎత్తయిన కొండలతో, అడవులతో చుట్టుకొని వుంది. చింతపండు, కరక్కాయలు, చీపుర్లు, వెదుర్లు మొదలయినవి ఈ ప్రాంతాల్లో సమృద్ధిగా లభించే అటవీ వస్తువులు.

ఈ శ్రీకాకుళం జిల్లాలోని గిరిజన తెగల్లో సవరలు, జాతపులను ముఖ్యమైన తెగలుగా చెప్పవచ్చు. ఈ రెండు తెగలకు ప్రత్యేకమైన సాంఘిక, సాంస్కృతిక, మత విధానాలున్నాయి. వీరు అనాదినుంచీ దుర్భరమైన పేదరికంలో జీవించారు. వీరి జీవన విధానం అజ్ఞానం, అనాగరికత, మూఢాచారాలతో పెనవేసుకొని వుండటంవల్ల, కాలానుగుణ్యమైన మార్పులకు వీరు అతీతులుగా వుండిపోయారు.

ఈ విధమైన సామాజిక, ఆర్థిక వెనుకబడిన తనంవల్ల వీరు గిరిజనేతర వ్యాపారస్థుల ఆర్థిక దోపిడీకి గురైయ్యారు. గిరిజనులకు అమితమైన వడ్డీలకు అప్పులివ్వడం, వారి పంటలను, అటవీ సంపదలను అతి చౌకగా కొనడం, వారి నిత్యావసర వస్తువులు అధిక ధరలకి అమ్మడంలాంటి అక్రమ చర్యల ద్వారా ఈ వ్యాపారస్థులు, వడ్డీ వ్యాపారస్థులు గిరిజనుల ఆర్థిక పరిస్థితిని పూర్తిగా కృంగదీశారు. గిరిజనులు ఈ అన్యాయాన్ని ప్రతిఘటించే శక్తియుక్తులు లేక మౌనంగా ఈ దారుణ దోపిడీని భరించారు. వీరి ప్రాంతాల భౌగోళిక పరిస్థితులు, వీరి విశిష్ట నైజం దృష్ట్యా గిరిజనోద్ధరణకి మనస్ఫూర్తిగా ప్రయత్నించలేదు. వారి అభివృద్ధికై ప్రవేశపెట్టిన శాసనాలు, చేపట్టిన కొద్దిపాటి కార్యక్రమాలు వీరికి రక్షణ, వుపశమనం యిస్తాయా ?

స్వాతంత్ర్యం వచ్చాక, దేశంలో సంక్షేమ రాజ్య స్థాపన ప్రభుత్వం ఏకైక ఆశయంగా రూపొందడంతో, గిరిజనులకు, మిగిలిన నిమ్నజాతి ప్రజల అభివృద్ధి, సమస్యలు వెలుగులోకి వచ్చాయి. వారి సామాజిక, ఆర్థికాభివృద్ధి సాధించడం ప్రభుత్వ లక్ష్యాలలో ప్రముఖమైనదిగా పరిగణింపబడింది. క్రమంగా వీరి బహుముఖాభివృద్ధికి అనేక ప్రణాళికలు, పథకాలు ఏర్పడ్డం వాటిని అమలు చేయుటకు ఎన్నో సంస్థలు ఏర్పడ్డం జరిగింది. ఆ విధంగా ఏర్పడిందే 'గిరిజన సహకార సంస్థ' కూడా.

ఈ జిల్లాలోని గిరిజన ప్రాంతాల్లో అతిముఖ్యమైన ప్రాంతమైన గుమ్మ లక్ష్మీపురంలో ఈ గిరిజన కో-ఆపరేటివ్ కార్పొరేషన్ 1957లో ప్రారంభించబడింది. గిరిజనుల ఆర్థికరంగాన్ని గిరిజనేతర దోపిడి కబంధ హస్తాలనుంచి రక్షించి, వారి బహుముఖాభివృద్ధి సాధించడం ప్రధాన ఆశయంగా ఈ సంస్థ ఈ ప్రాంతంలో అడుగు పెట్టింది. ఈ సంస్థ తన ఆశయానికి అనుగుణంగా గిరిజనుల అటవీ ఉత్పత్తులను సరసమైన ధరలకు కొనుగోలు చేయడం, వారికి అవసరమైన నిత్యావసర వస్తువులు సరఫరా చేయడం, వారి వ్యవసాయానికి అవసరమైన ఉత్పాదక రుణాలు అందజేయడం అనే త్రివిధమైన కార్యక్రమాలు చేపట్టింది. ఈ కార్యక్రమాలవల్ల గిరిజనేతర దోపిడీ తీవ్రత క్రమంగా సన్నగిల్లడం జరిగింది. క్రమంగా ఈ సంస్థ ఈ జిల్లాలో మిగిలిన ఏజన్సీ ప్రాంతాలయిన సీతంపేట, సాలూరు, పాతపట్నం ప్రాంతాలకు కూడ తన కార్యకలాపాలను విస్తరించుట, ప్రైమరీ సొసైటీలను, నిత్యావసర వస్తువుల డిపోలను ప్రారంభించడం జరిగింది. ఈ విధంగా ఈ సంస్థ కార్యకలాపాలు ఈ జిల్లాలోని గిరిజనులుండే ఏజన్సీ ప్రాంతాలన్నిటికీ విస్తరింపబడిన గిరిజనుల అన్ని అవసరాలను తీరుస్తున్నది. నేడు ఈ జిల్లాలో కార్పొరేషన్‌కి అనుబంధ సంస్థగా 4 ప్రైమరీ సొసైటీలు, 75 చౌక డిపోలు పని చేస్తున్నాయి.

ఈ జిల్లాలో ఈ కార్పొరేషన్ ముఖ్యంగా గిరిజనులనుండే అటవీ ఉత్పత్తులను కొనుగోలు చేయడంలోను, వారికి నిత్యావసర వస్తువులను సరఫరా చేయడంలోను చాలా ముందంజ వేసింది. ఈ రంగంలో, ఈ సంస్థ వ్యాపారం ప్రారంభించిన తొలినాటినుండే నేటివరకు గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ప్రతీ సంవత్సరం ఈ సంస్థ కొనుగోలుచేసే అటవీ ఉత్పత్తుల విలువ లక్షలలో ఉంటుంది. అలాగే గిరిజనులకు సరఫరాచేసే పలురకాల నిత్యావసర వస్తువుల విలువకూడా లక్షలలోనే ఉంటుంది. ఈ సంస్థ వారికి సరఫరా చేస్తున్న వస్తువులలో బియ్యం, ఉప్పు, కిరోసిన్, వంట నూనె, అగ్గిపెట్టెలు లాంటి నిత్యావసర వస్తువులు మొదలు బట్టలు గొడుగులు, సబ్బులు, స్నోలు, పౌడరులులాంటి ఆధునిక అలంకార సామగ్రివరకూ ఉన్నాయి. ఈ డిపోలవద్ద బియ్యం, పంచదార, కిరోసిన్, బట్టలు కంట్రోలు ధరకి చాలా చవకగా లభిస్తున్నా మిగిలిన వస్తువుల ధరలు అంత సరసంగాలేవు. వాటికి ప్రయివేటు వర్తకుల ధరలకి మధ్య పెద్ద తేడా ఉండటంలేదు. ఈ డిపోల వల్ల గిరిజనులకు నేడు ముఖ్యంగా బియ్యం, ఉప్పు, కిరోసిన్ చాలా

సరసంగా కావలసినంత దొరుకుతున్నాయి. ఈ డిపోలు లేని కాలంలో వీటి ధరలు ఆకాశాన్ని అంటి వుండడమేకాక, సమృద్ధిగా లభించకపోవడము జరుగుతుండేది. దీనివల్ల గిరిజనులు విపరీతంగా ఇబ్బందులకు గురయ్యేవారని నేడు అనుకోవడం జరుగుతున్నది. ఈ డిపోలు మారుమూల ప్రాంతాల్లో, దట్టమైన అడవులలో, కొండలపై కూడ తెరవటంవల్ల ఈ ప్రాంతాల్లో నివసించే ప్రజలకి నిత్యావసర వస్తువుల కొరకు ఎక్కువ దూరం కఠినమైన ఎగుడు, దిగుడు మార్గంలో ప్రయాణం చేయవలసిన దురవస్థ తప్పిపోవడం గిరిజనులకు చాలా సంతోషదాయక విషయంగా, శుభసూచకంగా భావించబడుతోంది.

ఈ విధంగా ఈ నిత్యావసర వస్తువుల సరఫరా కార్యక్రమం గిరిజనులకు సంతృప్తికరంగా ఉండి వారికి ఎంతో ప్రయోజనం చేకూరుస్తున్నా, అటవీ ఉత్పత్తుల కొనుగోలు విషయంలోను, ఉత్పాదక రుణాలు అందచేయడంలోను ఈ కార్పొరేషన్ గిరిజనులకు పూర్తిగా ఆమోదయోగ్యం కావడంలో విఫలమైందనీ, గిరిజనులేకాక బయటవారుకూడ అభిప్రాయ పడుతున్నారు. అందుకు కారణాలు లేకపోలేదు. ఈ కార్పొరేషను గిరిజనుల అటవీ ఉత్పత్తులకు ఇస్తున్న ధరలు సరసమైన స్థాయిలో ఉండటంలేదు. బయట మార్కెట్‌లో ఈ వస్తువులకు వున్న ధరలకన్నా కార్పొరేషన్‌వారు నిర్ణయించే ధరలు తక్కువగా ఉంటున్నాయి. ఉదాహరణకి చింతపండు ధర స్థానిక మార్కెట్‌లో 1-00నుండి 1-20 పైసలవరకు వున్నప్పుడు కార్పొరేషన్‌వారు చింతపండుకి నిర్ణయించిన ధర 0-50 పైసల నుండి 90 పైసలు మాత్రమే ఉండేది. అలాగే మిగతా వస్తువుల ధరలుకూడా మార్కెట్ ధరలకంటే తక్కువే ఉండేవి. ఇందుకు కార్పొరేషన్‌దే పూర్తి బాధ్యత అనడానికీ వీలులేదు. కార్పొరేషన్‌వారు చేసే ధరల నిర్ణయం ప్రభుత్వం ఇచ్చిన 'ఫార్ములా' ప్రకారం జరుగుతోంది. ప్రతీ అటవీ వస్తువు కొనుగోలు ధర నిర్ణయించేటప్పుడు అదే వస్తువుకి స్థానిక మార్కెట్‌లలో ఉన్న ధరలకి 10 శాతం తగ్గించి ధర నిర్ణయించాలని ప్రభుత్వ ఆదేశం. అందువల్ల కార్పొరేషన్‌వారు నిర్ణయించే కొనుగోలుధర మార్కెట్ ధరలకన్నా తక్కువ ఉండటం సహజం. ఈ విషయంలో ప్రభుత్వం పూర్తిగా తన వైఖరిని మార్చుకొని కార్పొరేషన్‌వారి కొనుగోలు ధరలు న్యాయంగా సరసంగా ఉండేటట్లు కార్పొరేషన్‌ని ఆదేశించాలి. అప్పుడే ఈ కార్పొరేషన్ గిరిజనులకు వారి అటవీ వుత్పత్తులకు సరసమైన ధరలు ఇవ్వడానికి అవకాశం వుంటుంది.

కార్పొరేషన్ కొనుగోలుచేసే అటవీవస్తువుల తూకంలో కూడా కొంత దోషంలేకపోలేదు. గిరిజనులలో ఈ అసంతృప్తి బాగా పేర్కొనిపోయింది. గిరిజనులు సంతలలోనికి తెచ్చే అటవీ వుత్పత్తులను తూకంవేసేటప్పుడు కార్పొరేషను సిబ్బంది కొంత తక్కువ తూకంవేయడం పరిపాటిగా జరుగుతోందని గిరిజనులు, వారినాయకుల నోటినుంచి తరచుగా వినిపిస్తున్నది. ఇందులో కొంత నిజం దాగిఉన్నదనిపిస్తోంది. అయితే ఈ దోషం పూర్తిగా కార్పొరేషన్‌దే అనిచెప్పడానికి కూడా వీలులేదు. ఇందులో గిరిజనుల పాత్రకూడా కొంత లేకపోలేదు. వారుతెచ్చే సరుకుల్లో నీళ్ళుకలపడం లేక పాడైపోయిందో, వచ్చిదో కొంత కలపడం తరచు చేస్తుండడం గమనించవచ్చు. దీనివల్ల గిరిజనులు తెచ్చేవస్తువులను ఖచ్చితంగా తూకంవేయడానికి కార్పొరేషను సిబ్బంది కొంత జంకడం జరుగుతోంది. దీనికి కారణం లేకపోలేదు. అటవీవస్తువులను కొనప్పుడు ఉన్నబరువుకీ, ఆసరుకులను కార్పొరేషన్ గోడౌన్లకి అప్పగించేటప్పుడున్న బరువుకి తరుగుఉంటే, ఆ తరుగును ఆసరుకును కొనుగోలుచేసే సిబ్బంది భరించే సాంప్రదాయం కార్పొరేషన్ పాటిస్తుండడం వల్ల ఈ సిబ్బంది ఈ చర్యకు పాలుపడడం జరుగుతోంది. అంతేకాక అటవీఉత్పత్తులకు సహజంగా తరిగిపోయేగుణం ఉన్నదికాబట్టి ఆతరుగులను పూరించేందుకు తప్పని సరిగా ఈ సిబ్బంది వాటిని గిరిజనుల నుండే కొనుగోలుచేసేటప్పుడు కొంత అవక తవకలు చేయవలసివస్తుంది. దీన్ని అరికట్టడం అంతకష్టమైన పనేంకాదు. ముఖ్యంగా, ఈ అటవీ ఉత్పత్తుల ధరలు న్యాయమైన స్థాయిలో మార్కెట్ ధరలకు వీలు అయినంత సమీపంగా ఉండాలి. అందువల్ల గిరిజనులు తమసరుకులలో నీళ్లు కలపడ, కల్తీ చేయడంలాటి చర్యలు అరికట్టవచ్చు. అసలుధరలు స్వల్పం కావడమే గిరిజనులు ఈ చర్యలకు పాలుపడడానికి దారి తెస్తుందనీ గుర్తించాలి. ఇక కార్పొరేషను సిబ్బంది సరుకులను తూచే సమయంలో నిజాయితీగా వుండేందుకు తగినచర్యలు తీసుకోవలసివుంది. వారు కొన్నసరుకులు గోడౌనుకు అప్పగించేటప్పుడు వచ్చేతరుగును కార్పొరేషను వారే భరించవలెను. దాన్ని సిబ్బంది భరించే సాంప్రదాయాన్ని తొలగించాలి అంతే కాక సరుకుకొన్న వెంటనే దాన్ని గోడౌనుకి చేర్చేందుకు ఏర్పాట్లు చేయాలి. ఈ సిబ్బంది కార్యక్రమాలపై తగిన నిఘా ఉండలి. వారు సరుకులను కొనేసంతలను కార్పొరేషను అధికారులు ఆకస్మిక తణిఖీచేస్తుండాలి. దానితోపాటు సంతల్లో అటవీ వస్తువులను కొనుగోలుచేసే కార్యక్రమాలు కొందరు నిజాయితీగల గిరిజననాయకులు కార్పొరేషన్ అధికారులు తదితర అధికారులుతో కూడిన సంఘాల పర్యవేక్షణలో జరిగితే. ఈ సిబ్బంది కొనుగోలులో ఎటువంటి అవకతవకలు చేసేందుకు ఏమాత్రం ఛాన్సుండదు. ఈ వ్యాపారంలో కార్పొరేషను మరో ముఖ్యమైన సమస్యను ఎదుర్కొంటోంది. అటవీవుత్పత్తులకు అక్రమరవాణా భారీఎత్తున సాగడం కార్పొరేషను ప్రయోజనాలకి ప్రమాదకరంగా పరిగణించింది. ఈ స్మగ్లింగు శ్రీకాకుళం జిల్లాలోకన్న మిగిలిన జిల్లాలలో భారీగా జరుగుతున్నటు కనిస్తుంది. ముఖ్యంగా ప్రయివేటు వర్తకులు మారు మూలలో వున్న గిరిజనులగ్రామాలకు స్వయంగా వెళ్లి, వారు సేకరించిఉంచిన సరకులను కొనుగోలుచేస్తూఉంటారు. సామాన్యంగా వీరుఇచ్చేధరలు కార్పొరేషను ఇచ్చేధరలకన్నా తక్కువగా ఉంటాయి. అయినప్పటికీ గిరిజనులు వారికి తమసరుకులను అమ్ముతారు చాలా దూరంలో ఉన్న సంతలకుసరకులను మోసు కొని వెళ్లే శ్రమను తప్పుకునేందుకు గిరిజనులు తమసరుకులను ధరతక్కువైనా ఈ వ్యాపారస్థులకు తమ ఇళ్లవద్ద అమ్మేస్తారు. కార్పొరేషను వారు ఈ సరుకులను సంతలలో కొనడమే తప్ప మారు మూల గ్రామాలకు వెళి కొనడంలేదు ఈ అక్రమరవాణాని నివారించేందుకు కార్పొరేషనువారు ముఖ్యమైన ప్రాంతాలలో చెక్‌పోస్టులలోని కాపలాదారులు ధనాపేక్షతో ఈ వ్యాపారస్తులు అక్రమంగా అటవీ వుత్పత్తులను తీసుకెళ్లడానికి అనుమతి ఇస్తున్నారని అందువల్లే ఈ అక్రమరవాణా నిరాటంకంగా సాగిపోతున్నదనీ, తెలుస్తోంది.

అంతేగాక పట్టుబడ్డదొంగ వ్యాపారస్థులను శిక్షించేఅధికారం కార్పొరేషను సిబ్బందికి తగినంత లేకపోవడం వారు అటవీవస్తువుల అక్రమరవాణా తమకళ్ళెదుట జరుగుతున్నా చూస్తూవుండవలసివచ్చిన పరిస్థితి కలిగింది. అడవులలో కొంత ప్రాంతం తమస్వంత ఆస్తిగా కలిగిన ముఖాసాదారులు కూడా అటు కార్పొరేషన్‌ని ఇటు గిరిజనులను మోసగిస్తూ అక్రమలాభాలను ఆర్జిస్తున్నారు. ఈ విధంగా కార్పొరేషను ఈ వ్యాపారంలో చాలా సమస్యలు ఎదుర్కొంటోంది. అందువల్ల అది ఆశించిన విధంగా గిరిజనులకు సహాయపడక పోగా తానుకూడా కొంతనష్టపడడం జరుగుతోంది. దీనివల్ల గిరిజనులు తమ అటవీ సంపదలనుండి తగినంత ఆదాయం పొందలేకపోతున్నారు.

ఈ జిల్లాలో గిరిజనకార్పొరేషన్ చేపట్టిన మరోముఖ్యమైన కార్యక్రమం గిరిజనరైతులకు వారి వ్యవసాయ అవసరాలనిమిత్తం స్వల్ప కాలిక, మధ్యకాలిక రుణాలను మంజూరుచేయడం. 1970 వ సంవత్సరం నుంచి కార్పొరేషన్ ఈ జిల్లాలోని గిరిజనులకు రుణాలు ఇస్తున్నది. ఈ పరపతి కార్యక్రమాలను కార్పొరేషను సమర్థవంతగా నిర్వహిస్తున్నా, కొన్ని లోటుపాట్లు లేకపోలేదు. ముఖ్యంగా ఈ జిల్లాలోని గిరిజనరైతులందరికీ కార్పొరేషను రుణాలు అందచేయలేకపోయింది. మొత్తం గిరిజన జనాభాలో 50 శాతం గిరిజనులకుమాత్రమే ఈ నాటివరకు రుణాల పంపిణీ జరిగింది. అంతేకాక కార్పొరేషను రుణాలు గిరిజనుల ఆర్థిక అవసరాలను పూర్తిగా తీర్చలేక పోతున్నాయి. కార్పొరేషను వారు ఎకరానికి 400 రూపాయలు చొప్పున స్వల్ప కాలిక రుణాలను, 800 రూపాయల చొప్పున మధ్యకాలిక రుణాలను ఇస్తున్నారు. అయితే ఈ మొత్తం వల్ల గిరిజన రైతుల అవసరాలన్నీ పూర్తిగా తీరడంలేదు. అందువల్ల గిరిజనులు అప్పులకై వడ్డీ వ్యాపారస్థులను ఆశ్రయించవలసి వస్తుంది. కార్పొరేషనువారు ఈ రుణాలను ధన రూపంలో, వస్తు రూపంలో ఇస్తున్నారు. వారు ప్రతి ఎకరానికీ ధన రూపంలో 120 రూపాయలుఇస్తూ, మిగిలిన మొత్తానికి ఎరువులు, విత్తనాలు, వినియోగవస్తువులు, బట్టలు సరఫరా చేస్తున్నారు.

ఈ జిల్లాలోని గిరిజనప్రాంతాల్లో అతిముఖ్యమైన ప్రాంతమైన కార్పొరేషనువారు రుణాల పంపిణీ విధానంలో కొంత లోటుపాట్లు ఉండటంచేత ఈ రుణాలవలన గిరిజనులు పూర్తిగా లాభంపొంద లేకపోతున్నారు. ముఖ్యంగా కార్పొరేషనువారు గిరిజనులకు సకాలంలో రుణాలను అందజేయలేక పోతున్నారు. పరిపాలనకి సంబంధించిన నియమాలు, నిబంధనలు ఖచ్చితంగా పాటించవలసి నందున ఈ జాప్యం జరుగుతున్నది. కార్పొరేషను వారు ఈ రుణాల క్రింద కొంత భాగంగా గిరిజనులకు రసాయనిక ఎరువులను సరఫరా చేస్తున్నారు. కాని గిరిజనులు రసాయనిక ఎరువుల వాడకంలో ఇంకా అనుభవం పొందలేదు. అంతేకాక వారి భూమి నైజగుణం, నీటి వసతులు లోపించడంలాంటి పరిస్థితులవల్ల వారి పొలాలకి ఎరువుల వాడకం వల్ల ప్రయోజనం అట్టే కనిపించదు. అందుకనివారు ఎరువులను వాడుటకు ఎక్కువ ఇష్టపడరు. అందువల్ల కార్పొరేషను వారు వారికి ఎరువులను సరఫరా చేస్తున్న వాటిని సద్వినియోగపరచడం చాలా తక్కువ. గిరిజనులు వాటిని ఉపయోగించకుండా అట్టే పెట్టివుంచడం, కొన్ని సమయాల్లో అమ్మివేయడం కూడా జరుగుతోంది. దానితోపాటు కార్పొరేషను వారు సరఫరా చేస్తున్న విత్తనాల విషయంలో కూడా కొంత దోషం లేకపోలేదు. కార్పొరేషను వారు విత్తనాలు సరఫరా చేయడంలో కాలాతీతం జరుగుతుండడంవల్ల గిరిజనులు వాటిని పొలాలలో చల్లడానికి కాకుండా అన్యథా వినియోగించడం జరుగుతోంది ఈ విధంగా కార్పొరేషను వారి రుణాల విధానంలో లొసుగులుండడంవల్ల గిరిజనులకు వాటివల్ల ఆశించిన ప్రయోజనత్వం చేకూరక పోవడం జరుగుతోంది. గిరిజనుల పొలాలనుంచి దిగుబడులు ఆశించినమేరకు పెరగలేకపోతున్నాయి. దానికి కేవలం కార్పొరేషనువారిదే పూర్తిబాధ్యత అనడానికి వీలులేదు. గిరిజనులు కార్పొరేషను ఇస్తున్న రుణాలను సక్రమంగా వినియోగించక, ఆ సొమ్మును దుబారా చేస్తూండడం సామాన్యంగా జరుగుతోంది. ముఖ్యంగా వారు కార్పొరేషన్ ఇస్తున్న ధనాన్ని మిగతా అవసరపు ఖర్చులకు వినియోగించడం, వారు ఇచ్చే విత్తనాల ధాన్యాన్ని తిండికి ఉపయోగించడం జరుగుతోంది. కార్పొరేషన్‌కి, గిరిజనుల రుణాల వినియోగాన్ని పర్యవేక్షణ జరిపే సిబ్బంది లేకపోవడంవల్ల ఈ దుబారాతనాన్ని అరికట్టలేకపోతున్నది. గిరిజనులలో ఇంకా మూఢాచార సాంప్రదాయాలు. అజ్ఞానం పేరుకొని ఉండటంవల్ల వారు కార్పొరేషను అందజేస్తున్న సహాయాన్ని సక్రమమైన పద్ధతిలో వినియోగించుకోలేని దుస్థితిలో ఉన్నారు. అంతేకాక వారు కార్పొరేషను ఇస్తున్న రుణాలను సక్రమంగా తిరిగి తీర్చడానికి కూడా అంతఆసక్తిని కనపర్చడంలేదు. అందువల్లకార్పొరేషను ఇప్పటివరకు ఇచ్చిన అప్పుల్లో దాదాపు 50 నుంచి 60 శాతం దాక గిరిజనులు తిరిగి తీర్చలేదు. దీనిమూలంగా కార్పొరేషను గిరిజనులకు కొత్తరుణాలు కానీ, ఎక్కువ మొత్తాలు అప్పులు ఇవ్వడంలో కానీ కొంత ఇబ్బందిని ఎదుర్కొనవలసివస్తుంది. అయితే గిరిజనులు తమ అప్పులను సక్రమంగా తిరిగి తీర్చలేక పోవడానికి వారి బలహీనమైన ఆర్థికస్థితి కూడా ఒక ప్రబల కారణమని మర్చిపోరాదు. వారి ఆర్థిక స్థాయి ఇంకా అట్టడుగు దశలోనే ఉంది. అందువల్ల గిరిజనుల ఆర్థిక స్థాయి పెరిగేవరకు వారు పండించిన పంటలు 'మిగులు దశ' అందుకునేవరకు వారినుంచి అప్పులను రాబట్టడం అంతతేలికైన విషయంకాదు. ఈ దురవస్థ కేవలం కార్పొరేషనేకాదు, గిరిజన ప్రాంతాలల్లో పనిచేస్తున్న అన్ని సహకార రంగాలను, బ్యాంకులను, ప్రభుత్వ సంస్థలను పట్టిపీడిస్తోంది.

ఈ విధంగా గిరిజన కార్పొరేషను శ్రీకాకుళం జిల్లా గిరిజన పాంతాల్లో నిర్వహిస్తున్న పాత్రని విశ్లేషించి చూస్తే, మొత్తం మీద దాని ఉనికి వల్ల గిరిజనులు కొంతఅభివృద్ధి పొందగలుగుతున్నారనే గమనించవచ్చు. ముఖ్యంగా గిరిజనులకు నిత్యావసరవస్తువులు అందించడంలో ఈ కార్పొరేషన్ డిపోలు ప్రశంసనీయంగా కృషిచేస్తున్నాయి. వీటివల్ల గిరిజన ప్రాంతంలోని నిత్యావసర వస్తువుల కొరత చాలామట్టుకి అంతరించి పోయింది. వారికి కావలసిన నిత్యావసర వస్తువులు సమృద్ధిగా దొరుకుతున్నాయి. దనివల్ల గిరిజనులు చాలామట్టుకి సంతృప్తులైనట్లు కనిపిస్తోంది.



— శ్రీ దోనేపూడి రాజారావు

చిరంజీవి ఆఫీసునుంచి వచ్చీరావటంతోనే సంధ్యతో కసురుకున్నట్టుగా చెప్పేశాడు. "నేనొక వారంలో అమెరికా వెళ్ళిపోతున్నాను, ఆఫీసు పనిమీద! రెండు, మూడు సంవత్సరాల దాకా అక్కడే వుండాల్సొస్తుంది!"

ఆమె ముఖంవంక చూడకుండానే సూటూ, బూటూ విప్పేస్తూ అనేశాడు. ఆ మాటలోని అంతరార్థం సంధ్యకు అర్థమయింది. కావాలనే తనకు దూరమయిపోతున్నాడని తెలుసుకొంది.

"అయితే మీతో నేనూ వచ్చేస్తాను!" ఎందుకయినా మంచిదని నెమ్మదిగానే అన్నది. చిరంజీవి కోపము నానాటికీ పెరుగుతోంది. తనయెడ చిరంజీవికున్న ప్రేమంతా ద్వేషంగా మారిపోవటంచూచి తనలో తాను వ్యధపడుతోంది.

ఈ మాట అంటూనే ఆమె చిరంజీవి విప్పేసిన బూట్లను బ్రష్‌తో దుమ్ము దులుపుతోంది. ఆమె చేతిలోని బూట్లను కోపంగా లాగేసుకున్నాడు చిరంజీవి. వ్యంగ్యంగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ మళ్ళీ కసురుకున్నాడు. "అక్కడకూడా వచ్చి నాకు మనశ్శాంతి లేకుండా చేద్దామనుకుంటున్నావా? అక్కడకూడా ఆ దేశాయ్‌గాడ్ని నాకు ప్రపకం చేద్దామనుకుంటున్నావన్నమాట! వాడు నిన్ను వదలడు! నువ్వు వాడ్ని వదలవు! ఇక నేనయినా దూరంగా పోతాను! మీరిద్దరూ హాయిగా కులకండి! ఆ చాటుమాటు బేరాన్ని ఇక పబ్లిగ్గానే సాగించండి! నిన్నక్కడకి తీసికెళ్తున్నానని తెలిస్తే వాడు మనకంటే అమెరికా ముందుగానే వెళ్ళి కూర్చుంటాడు!"

ఆ మాటలు సంధ్య భరించలేకపోయింది. చెవులు మూసేసుకొంది. కన్నీళ్ళు ప్రవహించాయి. ఆ బాధలో కోపం కూడ పైకుబుకొచ్చింది. "మీరుకూడా వాళ్ళకు మల్లేనే మాట్లాడుతున్నారా? ఐ హేట్‌యూ! ఐ హేట్‌యూ!" రోదిస్తూ చకచకా బెడ్రూమ్‌లోకి వెళ్ళి తన మంచానికి అడ్డం పడింది.

ఆ తరువాత వారం పది రోజులలో చిరంజీవి అమెరికా వెళ్ళిపోయాడు. ఈ వారం పదిరోజులు భార్యాభర్తల కిద్దరకూ మాటల్లేవు! ఆమె అలాగే మంచంమీద పడుంది. అతనలాగే పెడముఖంగా వుంటూ అన్నీ సర్దుకున్నాడు. అమెరికా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయాక సంధ్యకూడ తన పుట్టినింటికి వెళ్ళిపోయింది.

చిరంజీవి బొంబాయిలో ప్లేన్ ఎక్కాడు. ప్లేన్ ముందుకు దూసుకుపోతోంది. మనస్సేమో గతంలోకి తొంగిచూచి 'ఇదేం ఖర్మరా?' అని వాపోతోంది. తాను కావాలని చేసుకున్నాడు సంధ్యను. అలాగే ప్రేమించాడు. సంధ్యను క్రింద నడవనిచ్చేవాడు కాదు. సంధ్యను ఎప్పుడూ కార్లోనే తిప్పేవాడు. సంధ్య టాయిలెట్ టేబులు దగ్గర టాయిలెట్ అవుతూవుంటే పౌడరు, తిలకం అన్నీ అందించేవాడు. పూలచెండు తానే తల్లో ముడిచేవాడు. అద్దంలో ఆమె ప్రక్కగా నిలబడి ఇదంతా చేస్తూ, చూస్తూ, ఇరువురి ముఖారవిందాలను ఒకే చోట చూసుకొంటూ మురిసిపోయేవాడు. ఇలా ఒక సంవత్సరం గడచింది.

మ్యారేజి బర్త్‌డే రానే వచ్చింది. ఆ రోజుకోసం చిరంజీవి తహతహలాడాడు. "సంధ్యా! రేపు మన మేరేజ్‌డే! రేపు నేను ఆఫీసుకు సెలవు పెట్టున్నా!" ఆ మాట విని సంధ్య తన మీద తన భర్తకున్న అభిమానానికి ఉప్పొంగి పోయింది.

"ఈ చరణదాసి మీద మీకింత ప్రేమెందుకు? నేను భరించలేను!" అంటూ దగ్గరకువెళ్ళి భుజాలమీద చేతులువేసి ఆనంద బాష్పాలు రాల్చింది. చిరంజీవి కళ్ళు చెమ్మగిల్లాయి.

మరునాడు రానేవొచ్చింది. ఫస్ట్ వెడ్డింగ్‌డే యానివర్సరీ ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. గెస్టులంతా వస్తున్నారు. గేటు దగ్గర రిసెప్షన్ టేబుల్ దగ్గర నిలబడి సంధ్య, చిరంజీవి నమస్కారాలతో, షేక్‌హాండ్స్‌తో ఫ్రెండ్స్‌ని రిసీవ్ చేసుకొంటున్నారు. సంధ్య పెళ్ళికూతురిలా ముస్తాబై చిరంజీవి ప్రక్కన నిలబడి చిరంజీవి ఆనందాన్ని రెట్టింపు చేసింది. చిరంజీవి ఆనందోల్లాసంలో మునిగిపోయాడు. వారిద్దరూ ఫ్రెండ్స్ ఇచ్చే ప్రెజెంటేషన్స్ అందుకొని థ్యాంక్స్ చెబుతున్నారు.

ఇంతమంది ఫ్రెండ్స్‌వచ్చినా ఇంకా దేశాయ్ రాలేదు. ఆ దేశాయ్ కోసం సంధ్య కళ్ళు మధ్యమధ్యలో ఎదురు చూస్తూనే వున్నాయి. ఎవరో ఒకరిద్దర్ని అంత దూరాన చూసి 'దేశాయ్' అనుకొంది. దగ్గరకొచ్చేటప్పటికి విభ్రాంతురాలయింది.

ఈ సారి దేశాయ్ నిజంగా వచ్చాడు. చేతిలో ప్రెజెంటేషన్ వుంది, అతను రావటంచూసి వచ్చిన అతిథులలో గుసగుసలు బయలు దేరాయి. అవి చిరంజీవి చెవిలోనూ పడ్డాయి. కానీ అతని కర్థంకాలేదు.

దేశాయ్ వచ్చీరావట తోనే ప్రెజెంటేషన్ సంధ్య చేతికిస్తూ ముద్దుముద్దుగా సంధ్య వీపుమీద గుద్దులు గుద్దాడు. అతను తెచ్చిన ప్యాకెట్‌లో ఆకుపచ్చని చీరెవుంది. మ్యాచింగ్ జాకెట్, మరో చిన్నప్యాకెట్ జేబులోంచి తీసి చిరంజీవికిచ్చాడు నమస్కారం చేస్తూ. అందులో బంగారపు రింగ్ సెట్ ఉంది. అవి తీసుకొంటూ చిరంజీవి 'థాంక్స్' చెప్పాడు. కానీ మనసుమాత్రం దేశాయ్ మీదే వుంది.

సంధ్యతో పాటు దేశాయీ గాయపడ్డాడు, బాధపడ్డాడు. తానిక వెళ్ళిపోయాడు. సంధ్య క్షణక్షణం బాధతో క్రుంగిపోయింది. దేశాయ్‌కి జరిగిన అవమానానికి వెగ ఏడ్చింది. భర్త చిరంజీవి అనుమానాన్ని తుడిచి వేయటానికి ఎంతో ప్రయత్నించింది. అయినా అతడి అనుమానం ఆమె ఎంత చెప్పినా వాష్ కాలేదు.

వాళ్ళిద్దరికీ గుణపాఠం చెప్పాలని, కొన్నాళ్ళు ఆ సంబంధమేమిటో వేచి చూడాలని అందుకని 'కావాలని', అమెరికా ఆఫీసుకు బదిలీ చేయించుకున్నాడు. ప్లేన్‌లో ఎక్కాక గతం ఇలా ఒక్కసారిగా స్క్రీన్ రీల్‌గా బుర్రలో తిరిగింది.

చిరంజీవి అమెరికా వెళ్ళి మూడేళ్ళు గడిచింది. సంధ్య పుట్టింటికి ఆ మరునాడే వచ్చేసింది. ఆనంద్ దేశాయ్‌కి ఈ సంగతంతా తెలిసింది, తనవల్లే తన చెల్లికి ఈ కష్టం వచ్చిందని బాధపడాడు. చిరంజీవి అనుమానం పోగొట్టి సంధ్యా, చిరంజీవులను ఒకటి చెయ్యాలనీ, వాళ్ళిద్దరికీ మధ్య అడ్డంకిగా వున్న వాటిని తొలగిస్తానని, అనుమానాలన్నీ నిరాధారాలనీ రుజువు చేస్తూ చిన్ననాటి కథను పేర్కొంటూ మద్రాస్ ఆఫీసు నుంచి చిరంజీవి అమెరికా అడ్రస్ తీసుకొని ఇరవై పేజీల ఉత్తరం రాశాడు.

ఆ ఉత్తరానికి సమాధానం చిరంజీవి రెండు ముక్కలు రాశాడు. "మీరిప్పుడైనా పెండ్లి చేసుకోండి! నేను మీకు అడ్డం ఉంటానని అమెరికా వచ్చేశాను! నేనిక్కడొక అమెరికా అమ్మాయిని పెళ్ళి చేసుకొంటున్నాను!"

ఈ సమాధానానికి దేశాయ్ పరిపరి బాధపడాడు. మరో వైపు చిరంజీవి మీద ఎంతో కోపం వచ్చింది. తనమీద వేసిన అపవాదుకు కాదు, చెల్లాయి సంధ్యమీద వేసిన అపనిందకు అరనెంతో బాధపడ్డాడు. ఎలాగయినా చెల్లాయిని నిర్దోషిగా రుజువుచేయాలని పట్టుపట్టాడు. ఆ ప్రయత్నంలో అతను అడుగుపెట్టి అంతదూరం వెళ్ళనే వెళ్ళాడు.

చిరంజీవికి ఫస్‌సైట్‌లోనే ఫస్‌డేనే ఒక హోటల్ రిసెప్షనిస్ట్‌తో లవ్ కుదిరింది. అది వివాహంగా రూపొందింది. ఇప్పుడొక పెద్ద బంగళాలో ఆ అమెరికా అమ్మాయితో వుంటున్నాడు. ఇక ఇండియాకు తిరిగి రావాలని ఉద్దేశ్యం కూడాలేదు. ఎవరినైతే అతను అంతగా ప్రేమించాడో, ఆ సంధ్యే తన సర్వస్వం అనుకున్నాడో ఆమె ఇలా మోసం చేసిందను కున్నాక తాను తిరిగి ఇండియాకు వెళ్ళడమనేదే విరమించుకున్నాడు. ఇండియా అన్నా, ఇండియన్ లేడీ అన్నా అతనికంత ఏహ్యాభావం కలిగింది.

ఆ బాధను మరచిపోవడానికి, ఆ సంధ్యను శాశ్వతంగా మరచిపోవడానికీ తానంత తొందరపడి ఆమెను వివాహం చేసుకొన్నాడు. వివాహం చేసుకున్నాడే గానీ సంధ్యలా ఆమెను మనసారా ప్రేమించలేకపోతున్నాడు. సంధ్య చూపెట్టిన పవిత్ర ప్రేమ అతన్నప్పుడప్పుడూ ఉంగరాలు త్రిప్పుతూనేవుంది అమెరికా అమ్మాయి నైటింగేల్ సంధ్యలా మనసారా ప్రవర్తించటంలేదు. ఆ నైటింగేల్ చిరంజీవిని కాదు ప్రేమించింది —చిరంజీవి డబ్బును ప్రేమించింది.

ఈ నిజంకూడా చిరంజీవికి త్వరగానే తెలిసిపోయింది. చిరంజీవికి నెలజీతం రాగానే షాపింగ్‌కు తీసుకెళ్ళి ఓ డజను గౌన్లు, టాయ్‌లెట్ సెట్స్, ఇలా ప్రతినెలా వందలకు వందలు డాలర్స్ ఖర్చుపెడ్తోంది. పైగా తన బాయ్ ఫ్రెండ్స్‌తో పిక్నిక్‌కు పోతోంది. చిరంజీవి ఏమీ అనలేకపోతున్నాడు.

ఆఫీసునుంచి రాగానే పైపై ప్రేమను వొలకబోస్తూ, చిరంజీవిని కౌగలించుకొని "మీలాంటి డబ్బున్న భర్తను పొందిన నాలాంటి అదృష్టవంతురాలు ఈ టౌన్లోనే లేదు మై డార్లింగ్!" అంటూ నటించేది.

అలాంటి మాటలు విన్నప్పుడు చికాకువేసేది చిరంజీవికి. ఇండియాకు పరిగెత్తుకొని వెళ్ళి సంధ్యను క్షమాపణ కోరాలనిపించేది. నేనింత పనిచేశాక ఆమెనన్ను క్షమిస్తుందా? అనుకుంటూ ఒకనాడు వాషింగ్‌టన్ రాజవీధిలో అడుగులు తడబడుతూ నడుస్తున్నాడు. నైరాశ్యంతో ఒరువెక్కిపోయాడు. అడుగు పడటంలేదు. ప్రక్కనే ఉన్న బుక్‌షాప్‌లోకి వెళ్లాడు. ఏదైనా మంచి తెలుగు పుస్తకం కొనుక్కొని మనశ్శాంతి పొందుదామని! ఆ షాపులో కాషాయ పైజామా, షర్టూలోపుల గడ్డం, మీసాలు పెంచిన ఓ మధ్య వయసుగల మునిపుంగవుడు కన్పించాడు. అతనూ ఏవేవో తెలుగు పుస్తకాలు తిరగవేస్తున్నాడు.

చిరంజీవి రావటం చూచి ఆ మునిపుంగవుడు సంతోషంగా పలకరించాడు. "మీరు తెలుగువారు కదూ? ఐయాం వెరీగ్లాడ్ టూ మీట్ హియర్ ఎ తెలుగు మాన్!" అంటూ షేక్ హ్యాండిచ్చాడు

తాను షేక్‌హ్యాండుకు సమాధానమిస్తూ "నేనిక్కడ గత మూడేళ్ళ నుంచీ వుంటున్నాను! బ్యాండ్ లూమ్ మార్కెటింగ్ సొసైటీ బ్రాంచి ఒకటి ఇక్కడ ఓపెన్ చేశాము! ఈ బ్రాంచ్ మేనేజర్‌గా వుంటున్నాను! మీరెప్పుడొచ్చారు?'' కుతూహలంగా అడిగాడు చిరంజీవి.

"నేను రావడమేమిటి? నేనిక్కడే పుట్టాను. మా పేరెంట్సెప్పుడో వచ్చేశారిక్కడికి!''

"ఏమిటీ వేషంలో వున్నారు! ఈ వయసులో!" అంటూ కొంచెం అనుమానంగా, భయంగా అడిగాడు చిరంజీవి.

"నేను రామకృష్ణ మఠం తీసుకున్నాను. ఆ మఠంలో పని చేస్తున్నాను!" తన బుర్రగోక్కుంటూ అన్నాడు ఆ మునిపుంగవుడు.

''అయితే మా ఇంటికోసారెళదాం రండి!'' అభ్యర్థించాడు చిరంజీవి.

ఇద్దరూ కలిసి ఓ ఫర్లాంగు నడిచారు. తెలుగు కబుర్లు చెప్పుకున్నారు. ఇంతలో తాను పార్కు చేసిన కారు దగ్గర కొచ్చేశారు. చిరంజీవి తన కారులో ఆ మునిపుంగవుణ్ణి ఇంటికి తీసుకొచ్చేశాడు.

నైటింగేల్ తన బాయ్ ఫ్రెండ్స్‌తో కలిసి మద్యపానం చేస్తోంది. వాళ్లమీద విరగబడి నవ్వుతోంది. వీళ్ళను చూసి ఒక్కసారి ఆగిపోయింది. చిరంజీవి తన భార్యను పరిచయంచేశాడు ముని

పుంగవునకు. ముని పుంగవుడు ఇండియన్ స్టైయిల్‌లో నమస్కారం చేశాడు. ఆ నమస్కారం చూచి నైటింగేల్ బాయ్‌ఫ్రెండ్స్ హేళనగా నవ్వారు.

చిరంజీవి బాధపడాడు. "వాళ్లను బయటకు వెళ్ల కొడతావా? లేదా!" అని నైటింగేల్‌ను కసురుకున్నాడు.

''ఐయాం సారీ చిరంజీవీ ఫర్ దెయిర్ బిహేవియర్!'' బాయ్ ఫ్రెండ్స్ వెళ్లిపోయారు. చిరంజీవి తనదగ్గరకొచ్చిన నైటింగేల్‌ను కూడా దూరంగా నెట్టివేశాడు. అతనికంత కోపం వొచ్చింది. ఆ కోపాన్ని శ్రద్ధగా స్టడీ చేశాడు మునిపుంగవుడు. ఎంతో ఉల్లాస పడ్డాడు.

చిరంజీవి చేయి పట్టుకొని మునిపుంగవుని తన డ్రాయింగ్ రూముకు తీసికెళ్లాడు. తాపీగా కూర్చొని తాను సిగరెట్ కాలుస్తూ సిగరెట్ కేస్‌ని ఓపెన్ చేసి అతనికి ఆఫర్ చేశాడు.

''ఐయాం సారీ!'' అంటూ మునిపుంగవుడు ఆ సిగరెట్ కేస్ లోపల ఉన్న చిన్న ఫోటోను చూశాడు. అది సంధ్య ఫోటో! "ఎవరీమె? తెలుగు వనితలాగుంది!" అంటూ అంతలోనే గద్గద హృదయుడై పోయాడు.

"ఈ ఫోటో మా చెల్లెలు ఫోటో లాగావుంది! ఆమె ఈమధ్య కారు యాక్సిడెంట్‌లో చనిపోయింది!" అంటూ కంట తడి పెట్టాడు, ఫొటోవంక మరీ మరీ చూస్తూ మునిపుంగవుడు.

సిగరెట్ ప్యాకెను యాజిటీజ్‌గా ఇచ్చేశాడు మునిపుంగవుడు.

"ఏమిటీ, మీరు స్మోక్ చేయరా ? అమెరికాలో పుట్టి కూడా ధూమపాన నిషేధాలా ?"

"మా సన్యాసులకి స్మోకింగెందుకండీ ?"

"సాధువులూ, సన్యాసులూ, హిప్పీలు వీళ్లు త్రాగే సిగరెట్లు, గంజాయి. భంగు మాటేటి వాళ్ళు త్రాగుతున్నారా ?" అంటూ నవ్వాడు చిరంజీవి.

"ఇంతకూ మీరు నా ప్రశ్నకి సమాధానమివ్వలేదు ! ఆ ఫోటోలో అమ్మాయి ఎవరు ?" గుచ్చి గుచ్చి అడిగాడు మునిపుంగవుడు—"ఇది మీ వ్యక్తిగత విషయం అనుకోండి ! అయినా ఈమెను ఎక్కడో చూచినట్టు అనిపించటంతో తెలుసుకోవాలని పిస్తోంది" అన్నాడు మునిపుంగవుడు.

''ఆమె మీకిక్కడ ఎలాకన్పిస్తుంది ! ఆమె ఇండియాలో వుంది ఇప్పుడు !"

"అయినా ఈమెవరు ?"

"ఆమె నా వైఫ్"

"ఈమె మీ వైఫా ? అయితే ఆమె అక్కడ. మీరు ఇక్కడ...." అని అడిగాడో లేదో చిరంజీవి "అదంతా ఒక పెద్ద కథలెండి ! అద లా చెప్పి మిమ్మల్నెందుకు బాధ పెట్టాలి ?" తేలిగ్గా అనేశాడు చిరంజీవి.

"మీ బాధను నేనూ పంచుకుంటాను ! చెప్పండి..." పట్టు బట్టాడు ముని పుంగవుడు. చిరంజీవి చేయి పట్టుకున్నాడు.

చిరంజీవి తన కథ సవిస్తరంగా వినిపించి, చివరికి ముని పుంగవుణ్ణి రెండు చేతులూ పట్టుకొని బావురుమన్నాడు—"నా అంత దురదృష్టవంతుడూ, దుష్టుడూ, అవివేకీ మరెవరూ వుండరు బ్రదర్! సంధ్యా దేశాయ్‌ల అన్నా చెల్లెళ్ళ అనురాగాన్ని ఎవరో చెప్పుడు మాటలు విని అనుమానించాను. ఇప్పుడు వాళ్ళనెలా క్షమార్పణ కోరాలో బోధపడడం లేదు ! నాది చాలా చాలా తప్పయిపోయింది బ్రదర్ ! నా స్థితిలో మీరే వుంటే ఏంచేస్తారో చెప్పండి ! నన్నేం చేయమంటారో చెప్పండి !" అడుగుతూ కంటతడిపెట్టాడు.

"నేనయితేనా ? సంధ్యను వెంటలేసుకొచ్చేవాణ్ణి ! ఆమెకు నచ్చచెప్పటానికి ప్రయత్నించేవాణ్ణి" ! ముని పుంగవుడు అంటున్న ఈ మాటలు విని చిరంజీవి సిగ్గుపడాడు. తలవాలిపోయింది.

"ఆ ఎమోషన్‌లో—బ్రదర్! గుడ్డివాడ్నయిపోయాననుకో ! దాని ఫలితం ఇప్పుడనుభవిస్తున్నా ! నిన్నాటి నా సంధ్యారాణి ఏమయిపోయిందో? ఆమెకు ఇంత అన్యాయంచేసిన నేను ఆమెకు నా పశ్చాత్తాపాన్ని తెలుపుతూ లెటర్ రాయలేక పోతున్నాను! నాకు మార్గం చూపెట్టు బ్రదర్ !" అంటూ మళ్ళీ చేతులు పట్టుకున్నాడు చిరంజీవి.

"ఆలోచిద్దాం ! రేపు మళ్ళీ వస్తా !" అంటూ చేతులు విడిపించుకొని చిరంజీవికి ధైర్యం చెప్పాడు ముని పుంగవుడు.

మరునాడు మునిపుంగవుడు తన వాగ్దానం ప్రకారం చిరంజీవి ఇంటికి రానే వొచ్చాడు. చిరంజీవి కారు పోర్టికోలో వుంది. చిరంజీవి లోపలెక్కడో వున్నాడు. ముని పుంగవుడు పోర్టికోలో వున్న కారుని పరీక్షగా చూశాడు. చెయ్యివేసి టైర్లు, స్టీరింగ్ గేర్ టచ్ చేసి చూశాడు. ఆ తరువాత అతను లోపలికి వెళ్లాడు.

మునిపుంగవుణ్ని చూసి చిరంజీవికి ఇంత సుఖం అయింది. ఎదురొచ్చి రెండు చేతులతో రిసీవ్ చేసుకున్నాడు.

"నాకర్జంట్‌గా బ్యాంక్ పనివుంది బ్రదర్! ముందా బ్యాంక్ పని చూసుకొచ్చి నీ విషయం ఆలోచిద్దాం ! మీరు బ్యాంక్‌దాకా కార్ డ్రైవ్ చేయండి! బ్యాంక్‌కెళదాం!" అన్నాడు మునిపుంగవుడు

ఇద్దరూ కారువేసుకొని బ్యాంక్‌కు వెళ్ళారు.

''జస్ట్ ! వన్ అవర్‌లో నేను బ్యాంక్‌పని చూసుకొస్తాను'' మీరు నేరుగా ఇంటికి పదండి ! నాకోసం వెయిట్ చేస్తుండండి ! కారు దిగుతూ అన్నాడు మునిపుంగవుడు.

''అలాగే'' నంటూ చిరంజీవి తనకారు డ్రైవ్‌చేసుకొంటూ వెనుదిరిగాడు. మునిపుంగవుడు ఆ వెళ్లిపోతున్న కారును చూస్తూ నిలబడ్డాడు. ఆ కారు అలా ఓ ఫర్లాంగు పోయి ఎలక్ట్రిక్ పోల్‌కు గుద్దుకుంది. అక్కడికక్కడే జనం పోగయ్యారు. పోలీసులూ

బంధుమిత్రులంతా వొచ్చేశాక అంతా టేబుల్స్‌దగ్గరకు వెళ్ళిపోయారు. టేబుల్స్ బిగినింగ్‌లో సంధ్యా చిరంజీవులు 'కేక్' దగ్గర నిలబడ్డారు. ఆ కేక్ రాధాకృష్ణుల బొమ్మ ఆకారంలో వుంది. సంధ్య కేక్ కట్ చేసింది. అందరూ కరతాళ ధ్వనులు చేశారు. మొదటి ముక్కను చిరంజీవి నోట్లో వేసింది. ప్రక్కనే నిలబడివున్న రెండవ ముక్క దేశాయ్ నోట్లో వేసింది. అప్పుడూ అతిథులో మరోమారు గుసగుసలు చెలరేగాయి. "వీడింకా దీన్ని వదిలిపెట్టడా ఏంటి? పెళ్ళి కాకముందు ఏదో అనుకున్నాము! పెళ్ళయినాక కూడా ఇదేం వరుస?" అనుకుంటూ గుసగుసలాడారు అమ్మలక్కలు.

దేశాయ్ సంధ్య ప్రక్కనే నిలబడటం—సంధ్య దేశాయ్ నోట్లో కేక్ ముక్క వేయటం చిరంజీవి అనుమానాన్ని మరింత బలపర్చింది.

పార్టీ అయిపోయింది. అంతా వెళ్ళిపోయారు. దేశాయ్ ఇంకా వెళ్ళలేదు. సంధ్యా, దేశాయ్‌లు ఒక టేబుల్ దగ్గర కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. సంధ్య దేశాయ్‌ను చూసి సంవత్సరమయింది. ఆ పెళ్ళినాడు చూడటమే, ఆ పెళ్ళినాడు దేశాయ్‌దే పెత్తనం. ఆ నాడూ అడుగడుగునా దేశాయే కనిపించాడు. అయినా అతనికి ఎలాంటి అనుమానమూ కలుగలేదు. పెళ్ళయ్యాక, కొత్తగా కాపురానికొచ్చాక సంధ్యను అడిగాడు చిరంజీవి. "నీకు అన్నా తమ్ముళ్ళెవరూ లేరన్నావే! అతడిని అన్నా!' అని పిలుస్తావేమిటి?" కుతూహలంగా అడిగాడు ఆనాడు.

"అదొక పెద్ద కథ! నాకు పదేళ్ళుంటాయి. నాకు ముందూ వెనకా ఎవరూ లేరు! నా తోటి వాళ్ళకు ఒకళ్ళకిద్దరూ – ముగ్గురూ అన్నా తమ్ముళ్ళుండటం, అనురాగాలు పంచుకోవటం చూస్తుండేదాన్ని! వాళ్ళకు బర్త్‌డే రోజున వాళ్ళన్నయ్యలు రకరకాల బట్టలూ, బొమ్మలూ కొనితెచ్చేవాళ్ళు! బజారుకు వెళ్ళినప్పుడల్లా బజ్జీలు, బోండాలూ, పువ్వులూ, కాయలూ, నేరేడు పండ్లు, వేరుశెనగ పప్పులు – చెల్లాయిలకు రోజుకో వస్తువు తెచ్చిస్తుండేవాళ్ళు! వాళ్ళవి ఎదురెళ్ళి మరీ అందుకొనేవాళ్ళు! అన్నయ్యను చుటేసుకొనేవాళ్ళు! అనురాగంతో పెనవేసుకుపోయేవాళ్ళు అన్నా చెల్లెళ్ళు!

"చెల్లాయి బర్త్‌డే వొచ్చిందంటే అన్నాయిలకు పెద్ద పండుగ. ఎంతో సంబరంగా జరిపే వాళ్ళు! వాళ్ళ బర్త్‌డేల్లో వాళ్ళన్నాయిలు చేసిన హంగామా చూసి నాకూ ఒక అన్నాయి కావాలని మా అమ్మతో మారాం చేశాను! ఆ మరునాడే నా బర్త్‌డే. ఆ సాయంత్రం మా నాన్న లాన్‌లో కూర్చొని తన కొలీగ్ గౌతమ్ దేశాయ్‌తో కాఫీ తాగుతూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ గౌతమ్ దేశాయ్‌తోపాటు ఆయన ఫ్యామిలీకూడా వచ్చింది. భార్యా బిడ్డా ప్రక్కనే వున్నారు. ఆ బిడ్డకు పది పధ్నాలుగేళ్ళుంటాయి. అప్పుడు టెన్త్ చదువుతున్నాడు. వాళ్ళ గుజరాతీలు. అయినా మా కుటుంబంతో కలిసిపోయారు కొద్దికొద్దిగా మా సంపర్కంతో తెలుగుకూడా నేర్చుకున్నారు. హైదరాబాదు వచ్చాక చివరికి ఏ జపాన్, జర్మనీ వాళ్ళకయినా తెలుగు రాక తప్పదు, అందులో వాళ్ళదీ భారత్ హెవీ ఎలక్ట్రికల్స్‌లో జాబ్. అన్ని ప్రాంతాల వాళ్ళూ అక్కడ ఉద్యోగంలో వుంటారు.

"అన్నయ్యకోసం ఏడుస్తున్న నన్ను చెయ్యిపట్టుకుని మా అమ్మ లాన్‌లోకి లాక్కెళ్ళింది.

'అమ్మాయికి అన్నయ్య కావాలట! మారాం చేస్తోంది. రేపు అన్నయ్యుంటే గానీ బర్త్‌డే చేసుకోదట! ఇదెక్కడి చోద్యం? అదేమయినా చెట్టు పండా? కోసుకొచ్చివ్వటానికి?' చిరునవ్వు నవ్వుతూ దేశాయ్ కుటుంబంవంక చూస్తూ మా నాన్నసుద్దేశించి చెప్పింది మా అమ్మ.

ఆ మాట విని మా నాన్న తనలో తాను నవ్వుకున్నాడు. అది చూచి వాళ్ళూ నవ్వారు.

'ఇదిగోనమ్మా! నీ అన్నాయి!' అంటూ గౌతమ్ దేశాయ్ గారు ప్రక్కనే కూర్చున్న తన ఆనంద్ దేశాయ్ (కొడుకు)ని నా కప్పగించాడు. అది చూచి మా అమ్మా నాన్నా కళ్ళు నాతోపాటు ఆనందంతో చెమ్మగిల్లాయి.

"ఆ మరునాడు బర్త్‌డే న ఆనంద్ దేశాయ్ అన్నయ్యలుచేసే హంగామా అంతా చేశాడు ఈ చెల్లాయికోసం. ఇలా అతను నాకు అన్నయ్య అయ్యాడు. మొన్నటిదాకా, పెళ్ళయ్యేవరకూ ప్రతి బర్త్‌డేనా ఆయన కనిపించిపోవలసిందే! ఏవేవో స్వీట్సు, బిస్కెట్ ప్యాకెట్స్, టాయ్స్, టాయ్‌లెట్స్ ఇన్నిన్ని తెచ్చిపడేస్తుండేవాడు. ప్రతి పండక్కి పిలచి మా అమ్మా, నాన్న నాతోపాటు నా సరసన కూర్చోపెట్టేవాళ్ళు! కలసి భోంచేసేవాళ్ళం! వాళ్ళకు ఈ ఒక్క దేశాయే కాదు! ఇంకా ఇద్దరు, ముగ్గురు మగ పిల్లలున్నారు. అందుకని ఇతనెప్పుడూ మా ఇంట్లోనే వుండేవాడు! ఎటొచ్చి మన పెండ్లయ్యాకే రావటం తగ్గించాడు. పాపం అతను రావటానికి సిగ్గుపడుతున్నాడు!" అంటూ ఆనంద్ దేశాయ్ కథ చెప్పింది ఒకనాడు సంధ్య చిరంజీవికి. అప్పటికి అతనికేమీ అనుమానం కలుగలేదు.

ఆ ఫస్ట్‌వెడ్డింగ్ యానివర్సరీనాడు ఆ దేశాయ్ సంధ్యతో అలా మితిమీరి కలసి పోవడం, అమ్మలక్కలు గుసగుస లాడటంతో చిరంజీవిలో అనుమానం అంకురించింది. ఆ తరువాత దేశాయ్ టూరులో ఒకటి రెండు సార్లు మద్రాసు రావడం ఆ వచ్చిన వాడేమో రెండు, మూడు రోజులు కంటిన్యుయస్‌గా వుండి పోవటంతో చిరంజీవి అనుమానం మరింత చిగిర్చింది.

ఆ వాసన ఎలా చేరిందో చిరంజీవి ఆఫీసుదాకా కొట్టింది. చిరంజీవి బాసు, అతని కొలీగ్స్ అంతా వ్యంగ్యంగా అడగనే అడిగారు. "దేశాయ్ వచ్చాడటగా! ఇంకా వెళ్ళలేదా ఏం?" కన్నుగిల్లుతూ, నొసలెగరేస్తూ వ్యంగ్యంగా అడిగారు.

ఈ మాటలు చిరంజీవికి అగ్గి మీద గుగ్గిలంగా మండాయి. ఆవాళ కోపంతోనే ఇంటి కొచ్చాడు. అప్పుడు దేశాయ్ ఇంట్లోనే వున్నాడు. వాళ్ళు పకపకా నవ్వుకుంటూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంట్లో బాయ్ కూడా అక్కడే నిలబడి చూస్తున్నాడు. ఈ దృశ్యం చూచి క్రింది నుంచి పైదాకా మండి పోయాడు చిరంజీవి. ఇద్దర్నీ వ్యంగ్య బాణాలతో వేధించాడు.

వచ్చేశారు. చిరంజీవి 'స్టీరింగ్' మీద పడివున్నాడు. ముఖం నుంచి రక్తం కారుతోంది. స్పృహలేదు.

దూరాన్నుంచి చూస్తున్న మునిపుంగవుడు ఆ యాక్సిడెంట్ దగ్గరకు పరిగెత్తాడు. ఎందుకు జరిగిందా ఆ యాక్సిడెంట్ అనిచూస్తే టైర్లు పంచర్ పడున్నాయి. పోలీసువాళ్ళు చిరంజీవిని తీసుకొని దగ్గర్లోఉన్న ఆస్పత్రికి వెళ్ళారు. మునిపుంగవుడూ వాళ్ళతోపాటు హాస్పిటల్‌కు వెళ్ళాడు. తానూ విచారంగా ప్రక్కన నిలబడ్డాడు.

డాక్టర్ చెకప్‌చేసి కట్లుకట్టాడు. ప్రక్కనున్న మునిపుంగవునితో ఏదో ఓ పావుగంట రహస్యంగా మాట్లాడాడు.

పోలీసువాళ్లు డాక్టర్ చెప్పిన ప్రకారం కేసను నమోదు చేసుకొని వెళ్లిపోయారు. ఈ యాక్సిడెంట్ సంగతి అమెరికా భార్య నైటింగేల్‌కు తెల్సింది. ఆమె హుటా హుటీగా కారులో పరిగెత్తుకు వచ్చింది.

''హౌ ఈజ్ హీ డాక్టర్ !'' ఆతృతగా అడిగింది టింగేల్.

"హిస్ లైఫ్ ఈజ్ స్టిల్ ఇన్ డేంజర్ !'' సీరియస్‌గా చెప్పాడు డాక్టర్. ఆ మాటవిని నైటింగేల్ చరచరా ఇంటి కొచ్చేసింది. ఆమెకు అతనిమీద ప్రేమ లేదు, ప్రేమనటిస్తుంది. ఎప్పుడు చచ్చిపోతాడా? ఎప్పుడా ఇంటికీ, ఆస్తికీ వారసురాల నవుతానా అని కోరుకొంటోంది !

నైటింగేల్ వెనుకనే మునిపుంగవుడు చిరంజీవి ఇంటికొచ్చేశాడు. అతని చేతిలో ట్రాన్సిస్టర్‌లాంటి బ్యాగ్ వుంది. నైటింగేల్ తన బెడ్‌రూమ్‌లో తన బాయ్‌ఫ్రెండ్స్ మధ్యన కూర్చొని ఆనందోత్సాహాలతో ఎంతో బిగ్గరగా మాట్లాడుతోంది. ఆ మాటలు అల్లంత దూరాన్నుండే వింటూ తన చేతిలో వున్న ట్రాన్సిస్టర్ లాంటి బ్యాగ్‌లో ఏవేవో బటన్సు నొక్కాడు.

''మై డార్లింగ్స్! చిరంజీవికి గ్రాండ్ సీరియస్‌గా వుంది. అతను ఎంత తొందరగా చనిపోతే అంత మంచిది మనకు! నేనదే దేవుడ్ని ప్రార్థిస్తున్నాను! అతను చనిపోయాక ఈ ఇల్లూ, ఈ కారూ, ఈ ఇన్స్యూరెన్స్ పాలసీ, ఈ బ్యాంక్ బ్యాలెన్స్ అంతా మన కైవసం! అప్పుడు నా అంతటి అదృష్టవంతురాలు మరొకతె ఈ పేటలో వుండదనుకుంటా! వాడ్డూ యు సే మై డార్లింగ్స్!" అంటూ పగలబడి నవ్వుతోంది.

నైటింగేల్‌ని డాక్టర్ ఫీజుకూ, మందులకు డబ్బు అడుగుదామని వచ్చాడు మునిపుంగవుడు. ఈ మాటలు విన్న మునిపుంగవుడు అక్కడినుంచి అక్కడే వెనుదిరిగి హాస్పిటల్‌కు వచ్చేశాడు. ఆ తరువాత పది, పదిహేను నిముషాలకు నైటింగేలూ తన సిబ్బందితో హాస్పిటల్‌కు వచ్చేసింది.

ఎంతో బాధపడుతున్న దానిలా డాక్టర్‌నడిగింది. "హౌ ఈజ్ హి నౌ డాక్టర్ !".

"నౌ హీ ఈజ్ ఔట్ ఆఫ్ డేంజర్! థాంక్ గాడ్, మిసెస్ చిరంజీవీ !"

డాక్టర్ మాట విన్నతరువాత నైట్ంగేల్‌కి మతి పోయినట్లయింది. అన్‌కాంషస్‌గా "నో ! నో డాక్టర్ !" అంటూ ఇంకా ఏదో అనబోయింది, ఇంతలో ప్రక్కనున్న బాయ్ ఫ్రెండ్స్ ఆమెచెయ్యి గిల్లి కాన్షస్‌లోకి తీసుకొచ్చారు.

మాట మార్చివేసి నైటింగేల్ "ఓ థాంక్యూ డాక్టర్ !" అంటూ సంతోషం నటించింది.

"బ్రతికినా ఏం లాభం ? ఓ కాలు విరిగి పోయింది ! ఐ యాంసారీ, సీయింగ్ దిస్‌న్యూస్ !" అన్నాడు డాక్టర్.

చిరంజీవి ముందు ఆ మాటవిని నైటింగేల్ 'బాధ' నటించి తన బాయ్‌ఫ్రెండ్స్‌తో ఇంటికి వచ్చేసింది.

గిట్టి బ్యాండేజ్ వేశాక డాక్టర్ చిరంజీవిని ఇంటికి పంపేశాడు. చిరంజీవి తనకీ గతి పట్టినందుకు బాధ పడుతున్నాడు. మునిపుంగవుడు అతనికి ధైర్యం చెపుతున్నాడు. ఆ సమయంలో నైటింగేల్ ఇంట్లోలేదు.

"నీకు మార్గం చెప్పమని అడిగావు కదూ బ్రదర్? చెబుతాను విను!" అంటూ ఏదో చెవిలో ఊదాడు మునిపుంగవుడు. ముసిముసిగా నవ్వాడు. చిరంజీవి నవ్వుకున్నాడు.

మునిపుంగవుడు చిరంజీవి కూర్చున్న వీలింగ్ ఛైర్ నెట్టుతూ అలావరండాలో త్రిప్పుతున్నాడు. ఇంతలో నైటింగేల్ తన బాయ్‌ఫ్రెండ్స్‌తో ప్రవేశించింది. వీళ్ళను చూసి ముఖం చిట్లించింది. చిరంజీవి బ్రతకటం ఇష్టంలేదన్నట్లుగా. దగ్గర కొచ్చాక చిరంజీవి చెక్కిళ్ళను ముద్దెట్టుకొని ప్రేమ నటించింది.

చిరంజీవి ఆమె నటనకు మోసపోలేదు. ఆమెకు సరయిన సమాధానం చెప్పాడు–మునిపుంగవునితో మాట్లాడుతూ—

''మైడియర్ బ్రదర్! మీరు నా ప్రాణం రక్షించారు! మీ ఋణం ఎలా తీర్చుకోవాలో నాకు పాలు పోవటం లేదు! నాకు ఈ ఇల్లువుంది! కారువుంది! బ్యాంక్‌లో డిపాజిట్ వుంది! ఇవన్నీ మీకు ఇచ్చేసి మీ రుణం తీర్చుకుంటున్నాను!" అంటూ తన జేబులో వున్నకారు కీ, పాస్‌బుక్, ఇంటి డాక్యుమెంట్సు తీసి ఆయన చేతుల్లో పెట్టాడు.

"మరో వారంరోజుల్లో మనిద్దరం ఇండియా వెళ్ళి పోదాం నైటింగేల్!'' అంటూ అటు తిరిగి ఆమెను సంబోధించాడు.

"నీ లాంటి అవిటి వాడిని వెంట బెట్టుకొన్ని ఆ ఇండియాలో నేనేం చేసేది? ఐ వోంట్‌కమ్ విత్‌యూ! ఐ హేట్ యూ!" అంటూ చిరంజీవిని అసహ్యంగా చూచి వెనుతిరిగింది. తన బాయ్ ఫ్రెండ్స్ చేతులు పట్టుకొని తన బెడ్‌రూంలోకి వెళ్ళి పోయింది. అక్కడ తన పెట్టీ బేడా సర్దుకొని తన బాయ్‌ఫ్రెండ్స్‌తో ధనాధనా నిష్క్రమించింది.

ఆమె వెళ్ళి పోవటం చూచి చిరంజీవి ఎందుకో కంగారుగా "ఇప్పుడు నేను ఏం కావాలి మై బ్రదర్!" అంటూ మునిపుంగవుని చేతులు పట్టుకున్నాడు బాధపడుతూ.

మునిపుంగవుడు పీలింగ్ ఛైర్ నెట్టుకుంటూ చిరంజీవిని బెడ్‌రూంలోకి తీసికెళ్ళాడు.

గోడస్సాట్ కలరీ శాల్‌లో ప్రతిబింబొమ్మలా మెరిసిపోతూ సంధ్య ప్రత్యక్షమవటం చూచి చిరంజీవి ఆప్యాయత కేకపెట్టాడు. అలాగే చెప్పవేయటం నా దాంపత్యమూ సంధ్యవంక చూశాడు. వెళ్ళి ఆమె కాళ్ళమీద పడాలనిపించింది.

ఆ భావం గ్రహించిన సంధ్య తనకు దానుగా ఎదురొచ్చిన చిరంజీవిని ఒడిలోకి తీసుకొంది. చిరంజీవి ఆమెకు అతుక్కుపోయాడు. ఆమె తలవంచి తన పెదవులు ప్రేమగా స్పృశించి ఉచ్ఛ్వాస వదిలాడు. కంట తడిపెట్టాడు. అది చూచి మునిపుంగవుని కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆ తరువాత చిరంజీవి తన దృష్టి మునిపుంగవుని మీదకు ప్రసరించాడు. ఆ మునిపుంగవుడు తాను పెట్టుకొన్న గడ్డం, మీసం, తలమీద విగ్గు తొలగించాడు.

"దేశాయ్! నువ్వా? . నన్ను క్షమించు దేశాయ్! నీకు నా ముఖం ఎలా చూపెట్టేది? నీ రుణం ఎలా తీర్చుకొనేది? నేను మోసపోయాను దేశాయ్! మోసపోయాను!" అంటూ చేతులు చాచాడు చిరంజీవి.

"నిన్ను క్షమించబట్టే నా చెల్లి సంధ్యను ఇక్కడకు తీసుకొచ్చాను!" అంటూ తానే చిరంజీవి దగ్గరకు వెళ్ళాడు.

దేశాయ్ "నన్ను క్షమించావు కదూ? నిజంగా నా?" అంటూ దేశాయ్ చేతులు పట్టుకున్నాడు చిరంజీవి.

దేశాయ్ అతని వీపు తట్టుతూ "ఏమిటి మరీ అంతగా భయపడుతున్నావ్? నేను క్షమించే దేముంది! పడ్డ కష్టాలన్నీ నువ్వే పడ్డావు!" అని ఓదార్చాడు దేశాయ్.

అటు సంధ్య వైపుకు తిరిగి "నన్ను క్షమించు సంధ్యా! నీకు చేసిన అన్యాయానికి నేను తగిన శిక్ష అనుభవిస్తున్నాను! కాలు పోయింది!" అంటూ బావురు మన్నాడు చిరంజీవి.

"ఈ వికలాంగ దశలో నన్ను స్వీకరించమని నిన్నెలా అడిగేది సంధ్యా!" అంటూ మరొకసారి బావురు మన్నాడు చిరంజీవి.

"మీరు ఏ స్థితిలో వున్నా నావారే! మీ కాలుపోయినంత మాత్రాన నేను మీకు కాకుండా పోతేదు? ఏ పరిస్థితుల్లోనూ భర్తకు సేవ చేస్తానని ఆ వివాహ వేదిక మీద నేను ప్రతిజ్ఞ తీసుకున్నాను. నా ప్రతిజ్ఞను నేను నెరవేరుస్తాను! మీకు కాలులేని లోటును కనిపించనీయను!" ఓదార్చింది సంధ్య.

"ఎక్సెలెంట్ మై సిస్టర్! శభాష్‌గా మాట్లాడావు! ఇలాంటి మాటకోసమే నేనూ ఎదురు చూస్తున్నాను. ఇతర స్త్రీలకూ, భారతస్త్రీకి ఉన్న తేడాయే ఇది! నీ గౌరవాన్ని నువ్వు కాపాడుకుంటూ భర్త గౌరవాన్ని కూడా కాపాడావు!" అభినందించాడు దేశాయ్.




"ఓ డాక్టర్! ఇక్కడ నక్కున్నావయ్యా! నీరోల్ వచ్చేసిందయ్యా! తొందరగా ప్రవేశించు! వచ్చి ఆఫాల్స్ ప్లాస్టర్ విప్పేయవయ్యా!" అంటూ నవ్వుతూ ఓ గది వైపుకు చూశాడు దేశాయ్.

నవ్వుతూ ప్రవేశించాడు డాక్టర్ సిజర్స్‌తో ప్లాస్టర్ కట్ చేసి "వాక్ మేన్!" అంటూ డాక్టర్ చిరంజీవి చెయ్యి పట్టుకొని లేపాడు. "మీ భార్యాభర్తలిరువురూ పరీక్షల్లో నెగ్గారు! ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యారు! కంగ్రాట్యులేషన్స్!" అభినందించాడు డాక్టరు వారిద్దర్నీ.

చిరంజీవి కట్టుకట్టిన కాలు మొదట్లో నాలుగు తప్పటడుగులు వేసింది. తిరిగి సాఫీగా వచ్చింది. పరుగెత్తుకుంటూ వచ్చి చిరంజీవి దేశాయ్‌ని కౌగలించుకున్నాడు. "ఇదంతా ఎలాచేశావు మైడియర్! ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు చిరంజీవి.

"ఇదంతా ఒక పెద్ద కథలే, తరువాత చెబుతాను! ఈ యాక్సిడెంటూ నేను క్రియేట్ చేసినదే! ఇదిగో ఈ టేప్‌రికార్డర్-విను! నీ అమెరికన్ వైఫ్ నాటకమంతా కనిపిస్తుంది." అంటూ టేప్ రికార్డర్ ఆన్ చేశాడు.

"ఐ విష్ హి డైస్ క్విక్‌లీ" అంటూ నైటింగేల్ స్పీచ్ వినిపించింది టేప్‌రికార్డర్‌లో. అదివిని సంధ్య, డాక్టర్, చిరంజీవి అంతా ఆశ్చర్యపోయారు.

దేశాయ్ లోగడ చిరంజీవి తన కిచ్చిన కారు కీ, పాస్‌బుక్, ఇంటి డాక్యుమెంట్స్ చిరంజీవికి వొప్పగిస్తూ "ఇవి మా చెల్లెలు తరపున నీకు కట్నంగా ఇస్తున్నాను తీసుకో! అంటూ హ్యాండోవర్ చేశాడు. ఇకనయినా జాగ్రత్తగా మసలుకొని నా చెల్లెల్ని గౌరవంగా చూడు! ఇదే నా రిక్వెస్ట్!" అన్నాడు దేశాయ్.

"థాంక్యూ డాక్టర్!" అంటూ డాక్టర్‌కు షేక్‌హ్యాండిచ్చి సెండాఫ్ ఇచ్చాడు దేశాయ్.

# నడుపూడి, ఎలమంచిలి పంచాయతీలు

—శ్రీ సిద్ధాని నాగభూషణం

ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలే పాలకులు. ప్రజలు ఎన్నికల ద్వారా ప్రభుత్వాన్ని ఏర్పరచుకుంటారు. ప్రజలు ఏర్పరచుకున్న ప్రభుత్వం దేశ రాజధానిలోనో, రాష్ట్ర రాజధాని నుంచో పాలనచేస్తూ విజయవంతంగా ప్రజావసరాలను తీర్చటం కష్టసాధ్యమైన పని. దీనికి కారణం లేకపోలేదు. జిల్లా సమస్యలు, రాష్ట్ర సమస్యలు, స్థానిక సమస్యలు వేరు వేరుగా ఉంటాయికదా. స్థానిక సమస్యల అవగాహన రాష్ట్ర రాజధానులలో ఉన్నవారికి అవగాహన ఉన్నప్పటికీ, వాటిని పరిష్కరించటం కొంచెం కష్టమయిన పనే.

స్థానిక ప్రజల సమస్యల పరిష్కారంద్వారా దేశాన్ని పటిష్ఠం చేసే మహత్తర ఆదర్శంతో పంచాయతీ రాజ్యాన్ని ఏర్పాటు చేయటం జరిగింది. దేశ స్వాతంత్ర్య ఉద్యమానికి నాయకత్వం వహించి నిజమైన గ్రామరాజ్య సాధనకు పంచాయతీరాజ్యం ఒక విధానంగా రూపొందించుకుంటుంది.

## నడుపూడి గ్రామ పంచాయతీ

ఈ పంచాయతీరాజ్య విజయం ప్రజల సహకారం మీద, ప్రజా ప్రతినిధుల కార్యక్రమాల్లో రూపొందించి, వాటితో ప్రజాశక్తిని సమీకరించడం మీదనే ఆధారపడివుంది. ప్రజలు ప్రజా



శ్రీ ఎన్. స్వామి

ప్రతినిధులకు, సంస్థలకు చక్కని సహకారం అందించిన రోజున ఏవిధంగా గ్రామీణ సమాజం రూపురేఖలు దిద్దుకొనగలదో నిరూపిస్తున్నాయి. పశ్చిమ గోదావరిజిల్లా, నర్సాపురం తాలూకాకు చెందిన పోడూరు సమితిలోని నడుపూడి గ్రామ పంచాయతీ, మొగల్తూరు సమితికి చెందిన ఎలమంచిలి గ్రామ పంచాయతీ. వశిష్ట గౌతమీ నదీ తీరాన విలసిల్లుతున్న ఈ రెండు గ్రామ పంచాయతీలు ఏ విధంగా ముందడుగు వేస్తున్నాయో స్థానిక ప్రజా సమస్యల పరిష్కారాన్ని ఎలా సాధిస్తున్నాయో తెలుసుకొందామని ఆ గ్రామ పంచాయతీలను సందర్శించాను.

ప్రప్రథమంగా పోడూరుకు 12 మైళ్ళ దూరంలో వున్న నడుపూడి గ్రామపంచాయతీని సందర్శించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు, రాజనీతిజ్ఞులు శ్రీ కళా వెంకటరావుగారి ఊరయిన నడుపూడి గ్రామమయిన నడుపూడి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దైవక్షేత్రంగా విలసిల్లుతున్నది. 3222 మంది నివసిస్తున్న ఈ గ్రామపంచాయతీలో మిద్దెవారిపాలెం, బూరుగులంక, కట్టావారి పాలెం హరిజన పేటలున్నాయి. 1345.60 ఎకరాల ఆయకట్టు కలిగిన ఈ గ్రామపంచాయతీ సాలుసరి ఆదాయం 15,000 రూపాయలు. వరి, చెరకు, ప్రధానమైన పంటలు. అర్ధ శతాబ్దం క్రితం 1926వ సంవత్సరంలో నడుపూడి గ్రామపంచాయతీ ఏర్పడింది.



నడుపూడి సహకార గిడ్డంగి భవనం

నడుపూడి గ్రామంలో గ్రామపంచాయతీ ఏవిధంగా సమస్యల పరిష్కారానికి కృషి చేసిందో వివరించ వలసినదని ఆ గ్రామ పంచాయతీ సర్పంచ్‌ని అడిగినపుడు సర్పంచ్ శ్రీ నెక్కంటి స్వామి గారు వివరిస్తూ "మా గ్రామపంచాయతీ పౌరసౌకర్యాలు కల్పించే విషయంలో ఎంతోకృషి చేసిందని నేను సగర్వంగా చెప్పగలను. మా గ్రామ ప్రజలకు 1953వ సంవత్సరంలో నాయకత్వం ప్రస్తుతం వినియోగదారుల సమాఖ్య అధ్యక్షులు శ్రీ నెక్కంటి వెంకట జనార్దన్ రావుగారు వహించారు. శ్రీ జనార్దన్‌రావుగారు అప్పట్లో సహకార సంఘం అధ్యక్షులయ్యారు, ఒకవైపున గ్రామపంచాయతీకి మరొక



నిర్మాణదశలో మహిళామండలి భవనం



శ్రీమతి నెక్కంటి ఆదిలక్ష్మి

వైపున సహకార సంఘానికి నాయకత్వం వహించి రెండింటిని ఆదర్శంగా తీర్చిదిద్దారు శ్రీ జనార్దన్ రావుగారు" అన్నారు.

శ్రీ నెక్కంటి స్వామిగారు ఇంకా వివరిస్తూ "మొదట్లో మా గ్రామంలో సరిఅయిన రహదారులు లేవు. అన్నీ మట్టిరోడ్లే. గ్రామంలో రహదారులను ఏర్పాటు చేశారు గ్రామానికి శివార్లకు రహదారులను పంచాయతీ ఏర్పాటు చేసింది. గత దశాబ్దంలో లక్ష రూపాయల ఖర్చుతో రహదారులను వేయటం జరిగింది. నేను పదవిని స్వీకరించిన తర్వాత 20 వేల రూపాయలు ఖర్చు చేశాను. పారిశుద్ధ్య కార్యక్రమానికి కూడా అత్యంత ప్రాధాన్యం ఇచ్చి అరు మరుగుదొడ్లను నిర్మించాం. ఆరోగ్య రంగంలో విప్లవాత్మకమయిన మార్పులు తీసుకొని రావటానికి పరిరక్షిత మంచి నీటి పథకాన్ని 50,000 రూపాయల ఖర్చుతో అమలు పరచింది. ఈ పథకానికి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు ప్రారంభోత్సవం చేశారు.

"మా గ్రామంలోఉన్న ఐదు ప్రాథమిక పాఠశాలలకు శాశ్వత భవనాలను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ గ్రామంలో ప్రాథమికోన్నత పాఠశాల ప్రారంభించబడింది. బూరుగు లంకలో 12,500 రూపాయల ఖర్చుతో పాఠశాల భవనం నిర్మించబడింది."

గ్రామ పంచాయతీ కార్యాలయ భవనాన్ని 17,500 రూపాయల ఖర్చుతో నిర్మించి దానిని జిల్లా పరిషత్తు అధ్యక్షులైన శ్రీ అల్లూరి బాపినీడు గారిచే ప్రారంభోత్సవం చేయించడమయింది.

నడుపూడి గ్రామంలో హరిజన అభ్యుదయ విషయంలో జరిగిన కృషిని వివరిస్తూ శ్రీ నెక్కంటి స్వామిగారు "హరిజన వాడలకు ప్రధాన గ్రామానికి రహదారి సౌకర్యాలను ఏర్పాటుచేసింది. హరిజన వాడల్లో రహదారులను వేసింది. విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించింది. మరుగు దొడ్లను నిర్మించింది. కట్టావారిపాలెంలో 7,000 రూపాయల ఖర్చుతో, ప్రధాన హరిజనపేటలో ఆరువేల రూపాయల ఖర్చుతో ప్రాథమిక పాఠశాలలకు భవనాలను నిర్మించింది. ఈ సౌకర్యాలను కల్పించటానికి మా గ్రామ పంచాయతీకి అప్పట్లో నాయకత్వం వహించిన శ్రీ నెక్కంటి జనార్దనరావు ఎంతో కృషి చేశారని తెలియజేశారు. ఇటీవల కాలంలో మిద్దెవారిపాలెం, కట్టావారిపాలెం, చింతలపాలెం హరిజనులకు వెనుకబడినవారికి నివేశన స్థలాలను ఏర్పాటు చేయించడమయింది.

ఈ గ్రామానికి 1957 వ సంవత్సరంలో విద్యుచ్ఛక్తి విస్తృతమయింది. విద్యుచ్ఛక్తిని వినియోగించి వ్యవసాయాన్ని చేసుకొంటున్నారు. ఈ గ్రామంలో 40 ఫిల్టర్ పాయింట్లు ఉన్నాయి" అన్నారు.

1969వ సంవత్సరంలో శ్రీమతి నెక్కంటి ఆదిలక్ష్మి జనార్దనరావుగారి అధ్యక్షతను, 35 మంది సభ్యురాండ్రతో ఏర్పడిన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మహిళా మండలి ఎంతో ఉత్సాహంగా పనిజేస్తున్నది. పోడూరు సమితి తరఫున ఈ గ్రామంలో బలవర్ధక ఆహార పథకం నిర్వహించబడుతోంది. ఈ మహిళా మండలి ఆధ్వర్యంలో 25 మంది కుట్టు శిక్షణ పొందుతున్నారు. బాలవాడిలో ఉన్న 80 మంది బాలబాలికలకు శిక్షణ ఇవ్వబడుతోంది. మహిళామండలి శాశ్వత భవనం ఏర్పాటు చేసుకొంది. ఈ భవన నిర్మాణానికి 10,000 రూపాయలు ఖర్చుచేస్తే అందులో ఐదు వేల రూపాయలు పోడూరు సమితి విరాళం ఇవ్వగా గ్రామ మహిళలు 5,000 రూపాయలు విరాళం ఇచ్చారు. శ్రీమతి నెక్కంటి ఆదిలక్ష్మి గారి అధ్యక్షతను ఈ మహిళా మండలి ఎంతో సేవ చేస్తున్నది.

1960–61 సంవత్సరంలో పశ్చిమ గోదావరి జిల్లాలో ఉత్తమ సహకార సంఘంగా ఎన్నికైన నడుపూడి సహకార సంఘం 1918 సంవత్సరంలో 70 మంది సభ్యులతో ప్రారంభించబడింది. 1951 సంవత్సరంలో ఈ సహకారసంఘానికి అధ్యక్షులై శ్రీ జనార్దనరావుగారు 1973వ సంవత్సరంవరకు ఆ పదవిలో ఉన్నారు. 1965వ సంవత్సరంలో ఈ సహకార సంఘం గిడ్డంగిని నిర్మించుకొంది. ఫిక్సెడ్ డిపాజిట్ల పైననే నడుపబడే ఈ సహకార సంఘం నిరుపేదలకు సహితం అప్పులను అందజేస్తున్నది. 1973 వ సంవత్సరంలో శ్రీ నెక్కంటి స్వామిగారు సహకార సంఘ అధ్యక్షులై వ్యాపా

రాన్ని అభివృద్ధి చేశారు. ఈ నాడు 658 మంది సభ్యులున్న ఈ సహకార సంఘంలో సభ్యులు రూ. 5,375 వాటాధనాన్ని చెల్లించారు. ఈ సహకార సంఘం 2,30,000 రూపాయల అప్పును అందజేసింది. ప్రజలకు పంచదార, కంట్రోలు వస్త్రాన్నికూడా అందజేస్తున్నది.

ఈ నాటికీ ఏకగ్రీవమైన ఎన్నికలద్వారా గ్రామంలో ప్రజలు సహజీవనం చేస్తున్నారని నిరూపించిందని అన్నారు ఆ గ్రామ ఉప సర్పంచ్ శ్రీ మన్నె సుబ్బారావు గారు.

పాతిక సంవత్సరాల క్రితం 1953-54 వ సంవత్సరంలో ఈ పంచాయతీ ఆదాయం 1,900 రూపాయలు. అయితే ఈనాడు 26,000 రూపాయలు. రెండు దశాబ్దాలనుండి నూటికి నూరు పాళ్ళు పన్నులను వసూలు చేసిందీ గ్రామ పంచాయతీ. 1962-63 సంవత్సరంలో ఆచంట సమితిలో ఉత్తమ పంచాయతీగా ఎన్నికై నర్సాపురం తాలుకాలో పంచాయతీలకు మార్గదర్శకమయింది.

1973 వ సంవత్సరం నుంచీ నడుపూడి గ్రామ పంచాయతీకి నాయకత్వం వహించిన శ్రీ నెక్కంటి స్వామిగారి నాయకత్వంలో నడుపూడి నవ్యపథంలో ముందడుగు వేస్తున్నది.

## ఎలమంచిలి ప్రగతి

ఈ గ్రామాన్ని సందర్శించిన తర్వాత పాలకొల్లుకు ఆరు మైళ్ళ దూరంలో ఉన్న ఎలమంచిలి గ్రామ పంచాయతీని సందర్శించాను. ఈ గ్రామం పాలకొల్లు, దొడ్డిపట్ల రహదారిపై మేకపాడు జంక్షన్‌కు మూడున్నర కిలోమీటర్ల దూరంలో ఉన్న 7982 జనాభా కలిగి ఉంది. ఈ గ్రామానికి 9 వార్డులు ఉన్నాయి. ఈ ఎలమంచిలి గ్రామ పంచాయతీకి సుమారు రెండు దశాబ్దాల నుంచి నాయకత్వం వహించిన శ్రీ తాళ్ళూరి కుమారస్వామి ఉత్సాహవంతులైన పంచాయతీ రాజ్య కార్యకర్త.



ఎలమంచిలి పశువుల ఆసుపత్రి

ఈ గ్రామ పంచాయతీ అమలుపరిచిన అభివృద్ధి కార్యక్రమాల గురించి ఆ గ్రామ పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ టి. మల్లిఖార్జున రావు గారు వివరిస్తూ ఇలా అన్నారు "మా ఎలమంచిలి గ్రామ



శ్రీ టి. కుమారస్వామి

పంచాయతీ 6 కిలో మీటర్ల రహదారులను వేసి నిర్వహిస్తున్నది. విద్యుచ్ఛక్తి తీసుకొనిరావటానికి కృషి చేసిందీ గ్రామ పంచాయతీ. వీధులలో 89 విద్యుద్దీపాలను వేసింది. విద్యుచ్ఛక్తి విస్తృతపరచటానికి వీలులేని శివార్లలో, హరిజనవాడల్లో 88 కిరసనాయిలు దీపాలు ఏర్పాటు చేసింది. పంచాయతీ ఆరు రేడియో సెట్లను నిర్వహిస్తున్నది. పంచాయతీ నిర్వహిస్తున్న గ్రంథాలయంలో వెయ్యి పుస్తకాలు ఉన్నాయి, పంచాయతీ కార్యాలయ భవనాన్ని నిర్మించింది. సిమ్మెంటు మురుగు కాలువలను దాదాపు ఐదు వేల రూపాయల ఖర్చుతో నిర్మించి ది. హరిజన పేటలో మంచి నీటి బావులను ఏర్పాటు చేసింది. ఈ గ్రామంలో పంచాయతీపరంగా 18 చెరువులు, 16 మంచినీటి బావులు ఉన్నాయి.

శ్రీ మల్లిఖార్జునరావు గారు ఎలమంచిలి గ్రామ పంచాయతీ సాధించిన ప్రగతిని వివరిస్తూ ఇలా అన్నారు: "ఎలమంచిలి గ్రామంలో పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తు ఆధ్వర్యంలో ఉన్న ఉన్నత పాఠశాలకు శాశ్వత భవనాలు నిర్మించబడినాయి. శ్రీ తాళ్ళూరి నారాయణస్వామి జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల



ఎలమంచిలి ఉన్నత పాఠశాల

భవన నిర్మాణానికి సర్పంచ్ శ్రీ తాళ్ళూరి కుమారస్వామి 10,000 రూపాయలు తమ తండ్రిగారి పేరిట విరాళం అందజేశారు. పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తు మూడు వంతులు ఖర్చు భరిస్తే ప్రజలు ఒక వంతు భరించారు శ్రీ కుమారస్వామి పాఠశాల అధ్యక్షుడుగా ఉన్న రోజుల్లో 1,25,000 రూపాయల ఖర్చుతో భవన నిర్మాణపు పనులు పూర్తి అయ్యాయి."

పశువుల వైద్య కేంద్రం ఎలమంచిలి గ్రామంలో ఉంది. ఈ పశువైద్య కేంద్రానికి భవనం నిర్మించటానికిగాను శ్రీ తాళ్ళూరి విశ్వేశ్వర రావు అధ్యక్షతన ఏర్పడిన కమిటీ 25,000 రూపాయల ప్రజా విరాళంతో భవనాన్ని నిర్మించింది. శ్రీ ఈవర రాఘవులు 1,500 రూపాయలు ఖర్చుచేసి భవనానికి విద్యుచ్ఛక్తి వేస్తే, ఆస్పత్రికి కావలసిన సామానులు శ్రీ తాళ్ళూరి సూర్యనారాయణమూర్తి అందజేశారు. పశువులశాలను శ్రీ రుద్రరాజు సూర్యనారాయణరాజు నిర్మింపజేశారు. ఈ పశువులాస్పత్రి 20 కిలోమీటర్లలోపున వున్న 12 గ్రామాలకు ఉపయోగపడింది.

ఎలమంచిలి సేవా సకలార్థ సహకార సంఘం 396 మంది సభ్యులతో 22,050 రూపాయల వాటా ధనంతో రైతులకు ఉపయోగపడుతూంది. 14,612 రూపాయల విలువగల భవనాన్ని నిర్మించుకొంది.

ఎలమంచిలి గ్రామ పంచాయతీ ఆదాయాభివృద్ధికిగాను నాటిన 268 కొబ్బరికాయలు కాస్తున్నాయి. 1974–75 వ సంవత్సరంలో వేలంవేయగా 10,406 రూపాయలకు పాట పాడటం జరిగింది. ఈ విధంగా ఎలమంచిలి గ్రామ పంచాయతీ ఎంతో సేవ చేస్తున్నది. శ్రీ తాళ్ళూరి కుమారస్వామిగారి నాయకత్వం, ప్రజల సహకారం ఈ పంచాయతీ ప్రగతిపథంలో పయనించటానికి ఎంతో దోహదం చేసిందని వేరే చెప్పనవసరం లేదు.

ఏ పంచాయతీయైనా ముందడుగు వేసిందంటే దానివెనుక ఆ పంచాయతీ విశిష్టమైన నాయకత్వం, ప్రజల అండదండలు ఉంటాయన్న విషయం సుస్పష్టం. ☆

---

# 1977 సంవత్సరం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డులు

ఆధునిక తెలుగు సాహిత్యంలో ఉత్తమ రచనలకు బహుమతులు యిచ్చే పథకం క్రింద ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ **1977** వ సంవత్సరానికి ఐదు గ్రంథాలను ఎంపిక చేసింది. విజేతలకు రూ. **1,116** లు పారితోషికం యిస్తారు.

| గ్రంథం | | గ్రంథకర్త |
|---|---|---|
| నిశ్శబ్ద తరంగాలు (పద్యకావ్యం) | : | శ్రీ ఎల్లోరా |
| సంసార వృక్షము (నవల) | : | శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం |
| పశ్యచక్రం (చిన్నకథ) | : | శ్రీయుతులు విహారి, శాలివాహన |
| ధనుర్దాసు (నాటిక) | : | శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి |
| తెలుగు నవలా సాహిత్య వికాసం (విమర్శ) | : | శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు |

# మహాభారతము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

—111—

భీష్మ పితామహుడు, యుధిష్ఠిరుడు నివసించిన దేశములో స్థితిగతులను గూర్చి చెప్పెను. వాటిలో చాల గుణములు యీ నగరములోనున్నట్లు విన్నాను. కనుక పాండవులు గుప్త రూపములలో విరాట నగరమునందు నివసించుచున్నారని తలచెదను. కనుక, అక్కడికే పోయి వారిని కనుగొనవలెను. మనము పోయి మత్స్యరాష్ట్రమును ధ్వంసము చేయుదము. వారి గోధనమును పట్టు కొందాము, అప్పుడు గోవులను విడిపించుటకు పాండవులు గూడా మనతో యుద్ధము చేసెదరు. పదమూడవ యేడు నిండకముందే మనమొకవేళ పాండవులను కనిపెట్టగలిగినచో, వారు మరి పన్నెండు సంవత్సరములు వనవాసము చేసెదరు,మనకి రెండింటిలో ఏ యొక్కటి సమకూరినను లాభమే యగును.—పాండవులు దొరకకపోయినను ఈ యుద్ధయాత్రలో మత్స్య దేశమును కొల్ల గొట్టినచో మన ధనాగారము పెరుగగలదు. దానితోపాటు శత్రువుల వినాశము గూడ జరుగును. మత్స్యరాజు, 'పూర్వము తాను ధర్మరాజు పోషణలో ఉండీ యిపుడు దుర్యోధనుని ఆధీనములోకి పోవుదునా?' అని మన యెడల తిరస్కార భావముతో నున్నాడు. అతనిని అణచ వచ్చును. ఈ లాభమైనను కలుగునుగదా? కాబట్టి యిప్పుడు మనకు మత్స్యదేశముపైన దాడి సలుపుటయే కర్తవ్యము. ఇది అందరు అంగీకరించినచో, నీతి యుక్తముగా నున్నదని తలచెదను.' వైశంపాయనుడు దుర్యోధనుని మాటలు జనమేజయునకు చెప్పి తరువాత వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను:—

## త్రిగర్తులు-కౌరవులు మత్స్యదేశముపై దాడి చేయుట

"జనమేజయా! త్రిగర్త దేశాధిపతియైన సుశర్మ మహారథికుడు. అతడు కర్ణునివైపుచూచుచు దుర్యోధనునితో సమయోచితముగనిట్లనెను: "ప్రభూ! పూర్వము శాల్వ-మత్స్యదేశముల సైనికులు చాల సార్లు మనపై దాడిచేసి కష్టపెట్టిరి. విరాటరాజు సేనాపతియైన కీచకుడు, అనేక పర్యాయములు నాపై దాడిచేసి నన్ను చాల కష్టపెట్టెను. మత్స్యరాజు కీచకుని బలముతో నా రాష్ట్రమును బాధించెను. అట్టి క్రూరుడైన కీచకుడు గంధర్వులచేతిలో మరణించెను. వాని మరణముచేత విరాటరాజు దర్పము ఉడిగినది. ఆశ్రయహీనుడై యిప్పుడు ఉత్సాహము తగ్గియుండును నీకు ఇష్టమైనచో, నేను, కర్ణుడు, ఇతర కౌరవులు అందరుగూడ మత్స్యదేశముపై దాడి సలుపుట ఉచితము. అట్లుచేయుటకు అనుమతించుము. విరాటరాజు ధనములు, రత్నములు హరించి గ్రామములు ఆక్రమించుకొనుటకు ఇది సరియైన సమయము. లేదా, వేలకొలది గోవులను, ఆ నగరమును-పీడించి హరింతము. మనమందరము కలిసినచో ఈ పని అసాధ్యముకాదు. మత్స్యరాజే కాక అతని సేనను గూడ మన ఆధీనములోకి తీసికొనవచ్చును. దీనిచేత నీకు సైనికవృద్ధి, ధనవృద్ధి కలుగుటయేగాక, మనము సుఖముగా నివసించవచ్చును.'' ఆ మాటలు విని కర్ణుడు దుర్యోధనునితో నిట్లనెను:—

"రాజా! సుశర్మ చెప్పినమాట సంగతముగాను సమయోచితముగాను నున్నది. అట్లు చేయుట మనకు హితము. కనుక త్వరగా మత్స్యదేశముపై దాడి వెడలుదము. కురువృద్ధులైన భీష్మ, ద్రోణ-కృపాదుల అభిప్రాయ ప్రకారము మనము సైన్యమును సమీకరించుకొని కదలుట మంచిది. బలములోను, ధనములోను, పౌరుషములోను హీనులైన పాండవులతో మనకు పనియేమి? వారు పూర్తిగా అదృశ్యులైయుందురు. లేదా మరణించియుందురు. కనుక రాజా! మనము నిరాటంకముగా మత్స్యదేశముపై దాడిచేసి, వారి గోవులను, ధనములను ఆక్రమించుకొందము.'' జనమేజయా! కర్ణ సుశర్మల మాటలు విని దుర్యోధనుడు, తన యాజ్ఞాపాలకుడైన దుశ్శాసనునితో "కురువృద్ధుల సమ్మతి తీసికొని త్వరగా యుద్ధయాత్రకై సేనా సన్నాహము చేయుము" అని ఆజ్ఞ యిచ్చుచు నిట్లనెను:—

" ఏవైపు నుండి ఆక్రమించుటకు నిర్ణయము జరుగునో ఆ వైపే సైనికులతో వెడలుదము. సుశర్మకూడ, తన సైనికులతో అతడు నిర్ణయించుకొనిన దిక్కునకు పోవుగాక. మొదట సుశర్మ వెడలిన తరువాత, మరునాడు మనము వెడలి మత్స్యరాజ్యముపై దాడి సలుపుదము. వారు గోవులను పట్టుకొని, ఆ ప్రాంతపు ధనమునుగూడ హరించెదరుగాక. మనముగూడ సేనను రెండు భాగములు చేసి లక్షలాది గోవులను పట్టుకొనెదముగాక.''

"జనమేజయా! యిట్లు మా డుకొనిన పిదప సుశర్మ పూర్వ నిర్ణయము ప్రకారము, తన సైనికులతో కృష్ణపక్ష సప్తమినాడు విరాటనగరమునకు ఆగ్నేయమూలగా ఆ దేశమునందలి గోవులను పట్టుకొనుటకు, ప్రవేశించెను, ఈ విధముగా, అతని సైనికులు,

మత్స్యదేశములపై తమకు పూర్వము నుండి ఉన్న వైరమును తీర్చుకొనుటకు ఉత్సాహముగా వెడలిరి. ఆ మరునాడు, అనగా అష్టమినాడు, ఇతర దిక్కులనుండి, కౌరవులందరు కలిసికట్టుగా, వెడలి వేలాది గోవులను ఆక్రమించుకొనిరి.'' ఇట్లు చెప్పి వైశంపాయనుడు తరువాత కథ యిట్లు చెప్పదొడగెను:—

## దక్షిణ గోగ్రహణము

"జనమేజయా ! ఈ విధముగా విరాటరాజు నగరమునందు తమ తమ సేవలు నిర్వర్తించుచున్న పాండవుల అజ్ఞాతవాసపు గడువు కాలము ముగియవచ్చెను. కీచక మరణానంతరము విరాటరాజు ధర్మపుత్రునిపైన మిక్కిలి ఆదరబుద్ధి గలవాడై యుండెను. త్రయోదశి సంవత్సరాంతమునందు సుశర్మ తన సైన్యముతో విరాటరాజు గోవులను పట్టుకొనెను.

"త్రిగర్త సైన్యముల సింహనాదములు, పాదధూళులు ఆకాశమునంటెను. శంఖ–దుందుభుల ధ్వనులు విని గోపాలకులు ఆ సైనికులను ఆపిరి. త్రిగర్త సేనలు గోపాలురతో పోరాడి వారిని అణచి ఆ ప్రాంతమునందలి గోవులను ఇతర ధనాదులను దోచుకొనిరి. గోపాలకులతో వారికి యుద్ధము జరిగెను, వారు త్రిగర్తుల గుఱ్ఱములను చంపిరి. వివిధాయుధములతో త్రిగర్తులు గొల్లల నెదిరించి పారద్రోలిరి.

"ఒక గొల్లవాడు అతి వేగముతో నగరమునకు పోయి దూరమునుండియే రథము దిగి మత్స్యరాజు కడకు పోయి సభలో అనేక యోధ–మంత్రి–పాండవ సహితుడై యున్న విరాటరాజునకు నమస్కరించి యిట్లనెను : —"రాజా! త్రిగర్తులు మమ్ము యుద్ధమునందు ఓడించి లక్షలాది గోవులను తోలుకొని పోవుచున్నారు. మీ గోవులు పట్టుకొనిపోబడకపూర్వమే విడిపించి తెచ్చుకొనుడు" ఆ మాట విని విరాటరాజు, శత్రువులను ఎదిరించుటకు చతురంగ బలములను సమీకరించి యుద్ధ సన్నద్ధులగుటకు యోధులను రాజపుత్రులను ఆజ్ఞాపించెను.

"విరటుని తమ్ముడు శతానీకుడు బంగారు కవచమును, అతని తమ్ముడు మదిరాక్షుడనువాడు బంగారు తొడుపుగల ఉక్కు కవచమును, విరాటరాజు 'అభేద్యకల్పము' అను పేరుగల కవచమును, సేనాపతియైన సూర్యదత్తుడనువాడు సువర్ణమయ కవచమును, విరాటుని జ్యేష్ఠ పుత్రుడు శంఖుడనువాడు ఉక్కు కవచమును, యుద్ధ వీరులందరు తమ తమ దృఢ కవచములను ధరించిరి. సువర్ణాలంకార భూషితములయిన అశ్వములను పూన్చిన రథములను సిద్ధము చేసిరి.

"జనమేజయా ! ఇట్లు పోవుచున్న సైనికులు ఆ సాయంకాలం వరకు త్రిగర్తులను కలిసికొనిరి. ఇరు సేనలు గోవులయందు ఆశపడి పరస్పరము తలపడి యుద్ధము చేయుటకారంభించిరి. గజ సేనలు అతి భయంకరముగా పోరాడుచు, చచ్చుచు యమధర్మరాజు రాష్ట్రములో జన సంఖ్యను పెంచుచుండెను. అది దేవాసుర సంగ్రామమువలె ఉండెను. పరస్పరము అతిక్రమించి చంపుచు సాగిన ఆ దొంబి యుద్ధముచేత భూమి దుమ్ము రేగి వారికి ఏమియు కనపడకుండెను. ఆ ధూళిలో చిక్కుకొని పక్షులు నేల వాలెను. బాణముల చేత సూర్యమండలము కనపడకుండి, ఆకాశమంతయు బాణములు మిణుగురు పురుగులు వ్యాపించినట్లుండెను. రథికులు, రథికులతో పోరాడుచున్నప్పుడు ఒకరి ధనుస్సు పిడి మరియొకరు లాగుకొని వారిని నిరాయుధులను చేయ జొచ్చిరి. అశ్వికులు అశ్వికులతో పదాతులు పదాతులతో పోరాడుచుండిరి. నెత్తురు చేత ధూళి రజస్సు అణగుచుండెను. హద్దు మీరి యుద్ధము చేయుటచేత వారికి మూర్ఛ వచ్చుచుండెను.

"అప్పుడు యుధిష్ఠిరుడు తమ్ములతో పాటు సేనను శ్యేనాకారముగా వ్యూహము పన్నెను. ఆ డేగకు తుండముగా యుధిష్ఠిరుడు, రెక్కలుగా నకుల సహదేవులు, పుచ్ఛముగా భీముడును నిలుచునట్లు ధర్మపుత్రుడు వ్యూహము పన్నెను. యుధిష్ఠిరుడా యుద్ధమునందు వేయి మంది రథికులను వధించెను. భీమసేనుడు రెండువేల శత్రు రథములను యమలోకమునకు పంపెను. నకులుడు మూడు వందలు, సహదేవుడు రెండు వందల రథికులను మట్టుపెట్టెను. ఆ యుద్ధపు తాకిడికి తట్టుకొనజాలక పక్షులకు ఆకాశమునందు వాటి గమనము ఆగిపోయెను. తుదకు అవి కనపడకుండ గూడ నుండెను. ఎంతటి ప్రగాఢమైన దెబ్బలు తగిలినను నిజమైన వీరులు వెను దిరుగక నిలిచి పోరాడుచునే యుండిరి.

"విరటుని తమ్ములు—శతానీకుడు, విశాలాక్షుడు చేరి నూరు మందిని చంపి త్రిగర్త సైన్యములోకి దూరిరి. వారు శత్రు సైనికులను మూర్ఛితులను చేయజొచ్చిరి. ఇట్లు కేశా కేశి—రథా రథి యుద్ధములు జరుగుచుండెను. ఆ యిరువురికి ముందు సూర్యదత్తుడు, వెనుక విరూపాక్షుడు అను సోదరులు వారికి బాసటగా నిలిచి పోరాడుచుండిరి.

"ఆ యుద్ధమునందు విరాట రాజు ఐదు వందల రథములను భూమి పాలు చేసి, ఎనిమిది వందల అశ్వములను, ఐదుగురు మహా రథికులను చంపెను. తరువాత సుశర్మను తాకెను. సుశర్మ బంగారు రథమునందు విరాజిల్లుచుండెను. ఆ యిరువురు గోశాల రెండు బలముగల ఆబోతుల వలె పోరాడుచుండిరి. సుశర్మ విరాటునితో ద్వైరథ యుద్ధము సలుపుచు పరస్పరము శరముల గురియుచుండిరి. ఇరువురు యుద్ధ కుశలురే కాబట్టి ఒకరు కూడ తీసిపో అనేకా యుధములతో యొండొరులు కొట్టుకొన జొచ్చిరి. వారి యుద్ధములో రేగిన దుమ్ముచేత సైనికులు ఒండొరులను చూడజాలకుండిరి."

## సుశర్మ విరాటుని బంధించి కొనిపోవుట

"జనమేజయా ! ఆ సాయంకాలము చీకటిచేతను, దుమ్ము చేతను, సైనికులు పరస్పరము చూచుకొనజాలనప్పుడొక ముహూర్త మాత్ర కాలము ఊరక నిలిచి యుండిరి. ఆ ముని మాపటి చీకటిని చీల్చుచు, ఆ రాత్రినంతటిని ప్రకాశింప జేయుటకును, యోధులను ఆనంద పరచుటకును చంద్రుడు ఉదయించెను. వెన్నెల వచ్చిన పిదప యోధులు తిరిగి యుద్ధమునకు సన్నద్ధులైరి. ఘోరమైన యుద్ధము చేయుచు వారు, యుద్ధావేశముతో నొకరిని మరియొకరు చూడక యుండిరి. (సశేషము)

# రాజధాని విశేషాలు

—ఎల్లోరా

## హైదరాబాదులో "దూరదర్శన్"

మానవుడు సాధించలేనిదంటూ ఏం లేదు. మానవుడు మహోన్నతుడు.

1923లో వ్లాడిమిర్ జ్వారికిన్ మొదటి సారిగా టెలివిజన్ ట్యూబ్ తయారు చేశాడు. 1896లో మార్కొనీ రేడియోను కని పెట్టడం జరిగినా 1921 వరకూ ప్రపంచలో రేడియో ప్రసారాలు ప్రారంభం కాలేదనే చెప్పవలసి ఉంటుంది అయితే 1896లోనే మార్కొనీ రేడియోను కనిపెట్టాడు.

భారత దేశంలో టి.వి. ప్రారంభం అయి 16 సంవత్సరాలు అయింది. ఒకటిన్నర దశాబ్దాల కాలంలో దేశంలో అనేక ప్రధాన నగరాలలో ఈ టి. వి కేంద్రాలు నెలకొల్పారు. 1972లో బొంబాయిలో దూరదర్శన్ కేంద్రం స్థాపనతో కార్యక్రమాల వేగం పుంజుకొంది. 1973లో పూనా, శ్రీనగర్, అమృత్‌సర్‌ల లోను, 1975లో మద్రాసు, కలకత్తా, లక్నోలలోను, 1977లో జయపూర్, గుల్బర్గా, రాయపూర్, ముసోరీలలోనూ దూరదర్శన్ సౌకర్యాలు విస్తరిల్లాయి.

1975లో సైట్ (ఉపగ్రహం ద్వారా టెలివిజన్) కార్యక్రమాలు ప్రారంభం కావడంతో దేశంలో టి.వి. ప్రసార చరిత్రలో కొత్త ఘట్టం ప్రారంభం అయింది. ప్రచార, ప్రసార సాధనాలలో దూరదర్శన్ చాలా విలువైనదికదా!

ఇటువంటి అపూర్వ చరిత్ర కలిగిన దూరదర్శన్ కేంద్రాన్ని హైదరాబాదులో 1977 అక్టోబరు 23 సాయంత్రం సరిగా ఆరు గంటలకు భారత రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

ఈ కేంద్రం హైదరాబాదు నుండి 90 కిలో మీటర్ల దూరం వరకూ ఆ పరిధిలోని ప్రాంతంలో "దూరదర్శన్" ప్రసారాలు చూడడానికి వీలు ఉంటుంది.

టెలివిజన్‌ను ఇరవయ్యో శతాబ్దపు అత్యద్భుతాలలో మహాద్భుతంగా పేర్కొనవలసి ఉంటుంది.

## రాష్ట్రపతి సందేశం

హైదరాబాదు దూరదర్శన్ కేంద్రానికి, ప్రసారాలకు భారత రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేస్తూ "ప్రజలకు ఉపయోగకర సాధనంగా టెలివిజన్ రూపొందాలి. దూర ప్రాంతాలలోని పల్లెలకు సైతం ఈ సౌకర్యం లభించాలి" అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రసంగిస్తూ ప్రస్తుతం టెలివిజన్ ప్రసార సౌకర్యం లభించే 1600 గ్రామాలలో 140 పంచాయతీలకు ఇది వరకే "సెటలైట్" కార్యక్రమం సందర్భంగా నెలకొల్పిన టి.వి. సెట్లు ఉన్నాయని వివరించారు.

ప్రథమంలో కేంద్ర సమాచార శాఖ మంత్రి శ్రీ ఎల్. కె. అద్వాని స్వాగతం పలుకుతూ ఈ టి. వి. ఏర్పాటు లక్ష్యం వినోదంతో పాటు ప్రజలకు విజ్ఞానం కలిగించడమే నన్నారు.

గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ కృతజ్ఞతలు ప్రకటిస్తూ తనకు తెలుగు భాష నేర్చుకొనే అవకాశం దూరదర్శన్ వల్ల లభించగలదన్న ఆశాభావం వెల్లడించారు.

## ప్రజాకవి దాశరథికి సత్కారం

ప్రజలకోసం కలాన్ని విప్లవ పతాకంగా నిలబెట్టిన విప్లవ యోధుడు దాశరథి. ప్రజలకోసం పోరాటాల్లో పాల్గొని నిజాం నిరంకుశత్వాన్ని ఎదిరించి, ప్రజల పక్షాన గళమెత్తి నినదించిన ప్రజాకవి దాశరథి.

ఆ పోరాటంలో పాల్గొని దేశ స్వాతంత్ర్య సమరంలో జైలుకు సైతం వెళ్ళి కవిగా, రచయితగా, దేశ భక్తుడుగా జీవితాన్ని ధారపోసినవాడు కవితాశరధి దాశరథి.

అంతటి త్యాగధనుడు అయిన డాక్టర్ దాశరథిని ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవిగా నియమించిన శుభ సందర్భాన్ని పురస్కరించుకొని నవంబరు ఒకటవ తేదీన రవీంద్రభారతిలో కన్నుల పండువగా జరిగిన కార్యక్రమంలో అపూర్వంగా సన్మానించారు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంగా ఏర్పాటయిన ఈ కార్యక్రమానికి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అధ్యక్షత వహించారు. అనేక పోరాటాలలో పాల్గొన్న మహావీరుడు ప్రముఖ సాహిత్యోద్యమాలలో పాల్గొన్న ప్రజాకవి దాశరథిని ఆస్థానకవిగా నియమించడం అన్నివిధాల గర్వకారణమన్నారు.

గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ సాహిత్యంలో దాశరథి కృషిని, ఆయన ప్రతిభను కొనియాడారు.

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం దాశరథికి సన్మాన పత్రాన్ని సమర్పిస్తూ దాశరథి జీవితం అవిచ్ఛిన్నంగా సాగే తిమిరంతో సమరం అన్నారు.

సమాచార శాఖామంత్రి శ్రీ ఎం. మాణిక్‌రావు సమాచార, పౌర సంబంధాలశాఖవారు ప్రచురించిన గ్రంథాలను ఆవిష్కరించారు.

ప్రజాకవి డాక్టర్ దాశరథి కృతజ్ఞతలు అందిస్తూ తనను ఆస్థానకవిగా నియమించిన ముఖ్యమంత్రికి, ఆంధ్రప్రజానీకానికి కృత

జ్ఞతలు అందిస్తూ పోరాటంలోనే ఉత్తమ కవిత్వం ఆవిష్కృవిస్తుందని పేర్కొంటూ, ప్రజలే నా పుస్తకాలు—కవిత అన్నారు. అనంతరం కవిసమ్మేళనం జరిగింది.

## ప్రమాణాలుగల ప్రబోధాత్మక చిత్రాలు

ప్రజలలో ఆలోచనాశక్తిని పెంపొందించడానికి సమాజాన్ని ముందుకు నడిపించడానికి సినిమాలు చాలా కృషి చేస్తున్నాయి. సమాజ ప్రగతిలో సినిమాల పాత్ర, బాధ్యత చాలాఉంది.

1976లో విడుదలయిన ఉత్తమ తెలుగు చిత్రాలకు నంది అవార్డుల ప్రదానోత్సవం నవంబరు ఒకటవ తేదీన హైదరాబాదులో జరిగింది.

ఈ సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికను సాహిత్య అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరిస్తూ ప్రబోధాత్మక చిత్ర నిర్మాణానికి కృషి చేయాలని సూచించారు.

ప్రభుత్వ నంది అవార్డులను గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ ప్రదానం చేశారు. ఈ సమయంలో శ్రీమతి శారదాముఖర్జీ మాట్లాడుతూ వృద్ధ కళాకారులకు సాయపడే విధంగా నిధిని చేకూర్చాలని సూచించారు.

శ్రీ పి. జగన్మోహనరెడ్డి అవార్డు ప్రదానాలను గురించి ప్రసంగించారు.

నటులు శ్రీ నాగేశ్వరరావు, శ్రీ జగ్గయ్య ప్రసంగిస్తూ అవార్డులతో పాటు నగదు బహుమతి పెంచాలని సూచించారు.

దర్శకులు శ్రీ సి. ఎస్. రావు, శ్రీ బి. ఎస్. నారాయణ, శ్రీమతి అంజలీదేవి, కుమారి ప్రభ, కుమారి మాధవి, శ్రీ బి. ఎన్ రెడ్డి ప్రసంగించారు.

## అవార్డుల ప్రదానం

ఉత్తమ చిత్రాల ప్రథమ బహుమతి "ఊరుమ్మడి బ్రతుకుల"కు లభించింది. వారికి బంగారు నంది, రు. 25 వేల నగదూ బహూకరించారు.

చిత్ర దర్శకుడు శ్రీ బి. ఎస్. నారాయణ, నటీ నటులు సత్యేంద్ర కుమార్, కుమారి మాధవి అవార్డులను అందుకొన్నారు.

ద్వితీయ బహుమతి అంజలీ పిక్చర్స్ "మహాకవి క్షేత్రయ్య"కు లభించింది. వీరికి వెండినందిని బహూకరించారు.

చిత్ర దర్శకుడు శ్రీ సి. ఎస్. రావు, ప్రధాన పాత్రధారి శ్రీ నాగేశ్వరరావు కుమారి మంజుల, కుమారి ప్రభ బహుమతులను అందుకొన్నారు.

తృతీయ బహుమతి "అంతులేని కథ"కు లభించింది. ఆ చిత్రం పక్షాన కుమారి జయప్రద, శ్రీ జి. నారాయణరావు బహుమతులను అందుకున్నారు.

ఉత్తమ కథా చిత్రంగా ప్రథమ బహుమతి "పెళ్ళి కాని పెళ్ళి"కి లభించింది. శ్రీ బి. ఎన్ రెడ్డి, శ్రీమతి ఎ. రాజరాజేశ్వరి బహుమతులను తీసుకున్నారు.

ఉత్తమ కథా చిత్రం ద్వితీయ బహుమతి, "మనుషులంతా ఒక్కటే" చిత్రానికి లభించింది. శ్రీ పి. మహేష్ బహుమతిని అందుకున్నారు.

## 12 వారాలపాటు తెలుగు చిత్రాలు

కార్యక్రమం ప్రథమంలో సమాచారశాఖ మంత్రి శ్రీ మాణిక్‌రావు స్వాగతం పలుకుతూ రాష్ట్రంలోని ప్రతి థియేటరూ ఏడాదిలో విధిగా 12 వారాలపాటు తెలుగు చిత్రాలను ప్రదర్శించాలనే నియమాన్ని ప్రవేశ పెట్టాలని ఆలోచిస్తున్నట్లు తెలియజేశారు.

ముఖ్య మంత్రి శ్రీ జె. వెంగళరావు మాట్లాడుతూ తెలుగు చిత్ర నిర్మాతలను ప్రోత్సహించడానికి నంది అవార్డులు, పరిశ్రమను ప్రోత్సహించడానికి సబ్సిడీ పథకం ప్రవేశపెట్టబడినవని వివరించారు.

---

**లక్షలాది తుఫానుబాధిత ప్రజలకు ఆసరాగా వుందాం**

**ముఖ్యమంత్రి సహాయనిధికి, విరాళాలు అందిద్దాం**

---

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH. AT THE GOVT. CENTRAL PRESS, HYDERABAD.
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH, HYDERABAD.